# శిల్పాశ్రువులు



కవితా సంకలనం

జి.వి. సుబ్బారావు యం.ఏ.

# SILPASRUVULU

A Poetic Compilation

by

G.V. SUBBA RAO

First Edition
**January, 1995**

Price : **Rs. 20/-**

For Copies :
**G.V. Subba Rao,**
10-1-18/24, Shyam Nagar,
Hyderabad - 500 004

Printers :
**PLANOGRAPHERS,**
Chirag Ali Lane,
Hyderabad - 500 001
Ph : 203390

# మున్నుడి

ఈ కవితా సంకలనంలో - 'శిల్పాశ్రువులు' అన్న కవిత కేవలమొక ఊహాచిత్రం. ఒక్తి పగటికల! 'మనసొక రబ్బరుబంతి', 'మృత్యుభయం' అన్నవి, తాత్త్విక చింతనాన్ని, 'చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి!' అన్నది, - మనస్తత్వ శాస్త్రాన్ని, ఛాయామాత్రంగా సూచిస్తాయి. 'పిడికెడంత ఆకాశం' వాస్తవం కొంత, ఊహ మఱింత - కలగలిపిన కల్పనా ప్రపంచం. 'మన విశాఖ' స్వానుభవంలోంచి వెలికురికిన కవితారేఖాచిత్రం. 'ఎందుకో? మఱి ఎందుకో?!' - ఆర్తి, ఆవేదన, రసార్ద్రత - ముప్పిరిగొనాలని పడిన కవితా తపో భావన. 'కొసఊపిరి' - ఉపనిషత్కథ ఆధారంగా అల్లిన రచన. ఇలా ఎన్నో అనుభూతులు, ఆలోచనలు, ఎద లోతుల్లో మెదిలి, ఈ కవితలకు దారితీసాయి. రెండు దశాబ్దాలు (1972 నుండి 1992) సాగిన నా కవితా ప్రస్థానానికిది ఒక ప్రతీక.

నవంబరు, 1994 లో ప్రచురితమైన నా తొలి కవితా సంకలనం 'క్రాస్‌రోడ్స్' పై కొన్ని ప్రశంసలూ, మఱికొన్ని విమర్శలూ వచ్చాయి. సామాన్యుని కందుబాటుకాని సంస్కృత పదాలు, సమాసాలు విరివిగా వాడానని ఒక విమర్శ. ఆ గుణమో, దోషమో ఈ రెండవ కవితా సంకలనంలోనూ కొంత చోటు చేసుకొంది. దీనికి సమాధానం ఇచ్చే ముందు, ఒక విషయం చెప్పాలి. కవి, తన ఊహాలకు రూపకల్పన చేసేటప్పుడు భావ వ్యక్తీకరణకై, తగిన భాషనూ, శబ్ద జాలాన్ని ఎన్నుకొంటాడు, తన ప్రతిభావ్యుత్పత్తుల పరిధిలో. అది సంస్కృతమైనా, తెలుగైనా, ఇంగ్లీషైనా, - అవసరమైతే ఉర్దూ అయినా, కావచ్చును. వేదాంత పరిభాషలో భావ సమన్వయానికి, అర్థ గాంభీర్యానికి - లక్షణ వాక్యాల నెన్నుకొన్నట్లు. నా కవితలలో ఈ ప్రయత్నమే చేసాను. ఇంతకన్నా చెప్పగలిగిందేమీ లేదు.

పాఠక జన మహారణ్య మధ్యంలో స్వేచ్ఛగా తిరగమని నా కవితా కురంగాన్ని (క్రాస్‌రోడ్స్) వదిలేసాను ఇంతకుముందు. ఇప్పుడు ఈ కవితా తురంగాన్ని (శిల్పాశ్రువులు) రసిక జన సహృదయ మహానగర వీథులలో స్వైర విహారం చేయమని వదిలిపెడ్తున్నా. పాఠకులకు - కవితాశ్వ హృదయం మెఱిగి స్వారి చేయమని - విన్నవిస్తూ సెలవు తీసుకొంటాను.

జనవరి, 1995 — భవదీయుడు

హైద్రాబాదు — **జి.వి. సుబ్బారావు**

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | శిల్పాశ్రువులు | 1 |
| 2. | కవితా! ఓ కవితా! | 10 |
| 3. | చంద్రుని కో నూలుపోగు | 12 |
| 4. | ఎందుకో? మఱి ఎందుకో?! | 14 |
| 5. | మన విశాఖ | 18 |
| 6 | నిశ్శబ్దనాదం | 23 |
| 7. | ఎండ! ఎండ!! ఎండ!!! | 25 |
| 8. | ఎండమావులు | 29 |
| 9. | చీకటి పిలుపు | 35 |
| 10. | పునర్జన్మ | 39 |
| 11. | మగువ మనసు | 41 |
| 12. | ఏమంటారు? మీరేమంటారు? | 46 |
| 13. | లిమిటేషన్ | 49 |
| 14. | ఆశల చివుళ్ళు | 51 |
| 15. | చరిత్ర చర్వణం | 57 |
| 16. | మనసొక రబ్బరుబంతి | 59 |
| 17. | చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి! | 63 |
| 18. | అజ్ఞాతగళం | 69 |
| 19. | మళ్ళీ తలెత్తాను నేను | 72 |
| 20. | అంతర్మథనం | 76 |
| 21. | పిడికెడంత ఆకాశం | 79 |
| 22. | మళ్ళీ నేను చిగురిస్తానా? | 88 |
| 23. | ద్విజిహ్వ | 92 |
| 24. | కొనఊపిరి | 96 |
| 25. | మృత్యుభయం | 99 |
| 26. | భేతాళ నృత్యం | 104 |
| 27. | ఉషస్సులో నా తపస్సు | 106 |

# శిలాశ్రువులు

అహో!
ఏమానందం? ఏమానందం?
పరమానందం! మహదానందం!
భాగ్యనగర బ్రహ్మానందం!! -
అదిగో!
టాంక్‌బండ్‌ని ముంచెత్తిన
ప్రళయఝరీ తరంగ ప్రవాహం!
అల్లదిగో!
వెల్లువలై హుసేన్‌సాగర్
గట్లు పొంగి, పొరలుతున్న
తటాక హఠాత్ప్రవాహం!
జంటనగరాల మధ్య అగాధంలా
కంటిచూపు మేర పరుచుకొన్న, విరుచుకొన్న
సరసీ తరంగ వీరవిహారం!
అపర గోదావరిలా విజృంభిస్తున్న
మహోజ్జ్వల జలప్రవాహం!
దోమల్‌గూడా గుడిసెల్లో
వెల్లుబుకుతున్న మహా ప్రవాహం!

చిక్కడపల్లిని చిక్కుల్లోబెట్టి
అశోక్‌నగర్‌ని శోకవనం చేసి,
విశృంఖలంగా, జలపాతంలా, హోరుమని
ప్రవహిస్తున్న నిరంతర ఝరీ ప్రవాహం!
అబ్బో!
ఏమా గుంపులు? ఏమా జనసందోహం?
ఏమా త్రొక్కిడి? ఏమా అలజడి?
జంటనగరాల ప్రజలు నేల యీనినట్లుగా -
ఆబాలవృద్ధులూ, స్త్రీలూ, పురుషులూ -
అంతా - టాంక్‌బండ్‌కు ఇద్దరినీ, అద్దరినీ
గుంపులు, ముంపులుగా నిలబడ్డారు
ఎగబడి, పైకెగబడి చూస్తున్నారు
ముక్కు మీద వేలేసుకొన్నారు
నోళ్ళు దెరిచి, కళ్ళు విచ్చి, తదేకంగా చూస్తున్నారు!
అఖండ ధారాపాతంగా, నిర్నిరోధ శబ్ద నిర్ఝరిగా
బండ్ మీద పొర్లిపోతున్న ఆ జలప్రవాహాన్ని చూసి!
మాటరాక, నోరు పెగలక, మూగవోయి
శిలా స్వరూపాలై విస్తుపోయి, చూస్తున్నారు!!
ఆ విచిత్ర సన్నివేశాన్ని!-
ఈ అసాధారణమైన
ఈ అనూహ్యమైన
ఈ అపూర్వమైన దృశ్యాన్ని -
నేనూ చూసాను!
ఆ మహోత్తుంగ తరంగ సంఘాల్ని
ఆ ప్రళయ జల మహోజ్జ్వల ఘోషల్ని -
నేనూ విన్నాను! కన్నాను!
అయినా -

ఇది ఆషాఢస్య ప్రథమ దివసం గాదు!
ఇది శ్రావణ సంధ్యా మేఘ గర్జనా ప్రకంపిత
వర్షాకాలం గానే గాదు!!
ఇది ఆశ్వయుజం!
ఇది శరదాగమన సూచక ప్రశాంత నిశాసమయం!
ఇది వీపులు మాడ్చే ప్రచండ భానుకిరణ
విశృంఖలా విహరణ మాసం!
ఎక్కడిదీ అకాలవర్షాడంబరం?
ఎక్కడిదీ నిర్నిమిత్త జలనిర్ఘోషం!
ఎక్కడిదీ నిర్హేతుక జాయమాన ద్యూక్షవీక్షా కటాక్షం?
ఎంత ఆలోచించినా అంతు చిక్కటంలేదు!
ఎందుకీ సాగర్ పొంగులు అర్థాంతరంగా?
ఎందుకీ సుడిగాలిలా వరదలు, బండ్ గండ్లు పడేటంతగా!
తలపట్టుకు కూర్చున్నాను, నిస్పృహతో, నిరాశతో, భయంతో!
'ఓ! కవీ!' -
అన్న పిలుపు నా చెవిని పడింది!
'ఓ మనసున్న మనిషీ!'
అన్న ఆర్తనాదం, నా హృదయం లోతులు తాకింది!
అంతే - ఉలిక్కిపడి, తలెత్తి చూచాను!
గగనంలో, వినీలాకాశంలో,
హుసేన్‌సాగర్‌కి ఎగువగా
మొయిళ్ళ బయళ్ళలో
గుంపులు గుంపులుగా,
ఆజానుబాహులు, స్ఫురద్రూపులు,
మహోన్నత తేజోమూర్తులు,
ఎందరో మరెందరో,
పురాతనాంధ్ర కీర్తిపతాకల్లా,

దృగ్గోచరమైనారు!
మసక మసక చీకట్లలో
మిసిమి గొలిపే పసిడి కాంతులతో
ధృవతారల్లా, వెలిగిపోతున్నారు
ఆ మహానుభావులు! ఆ మహా మనీషులు!!
కానీ, అందరి మొగాలల్లో అంతులేని దిగుళ్ళు!
అందరి కళ్ళల్లో, విషాదాశ్రు నిర్ఝరులు!
నా మనస్సు ఆవేదనా స్రవంతి అయింది
నా గళం డగ్గుత్తికతో విలవిలలాడింది!
ఎలాగో గుండె కుదుట బరుచుకొని, గొంతు పెకల్చుకొని -
'సలామ్ సబ్ కో!' అన్నాను!
"అందరూ మహానుభావులే!
ఎందుకయ్యా! మీకీ విషాదం?
ఎందుకయ్యా! మీకీ అశ్రు ప్రవాహం?" -
క్షణం నిశ్శబ్దం తాండవించింది
క్షణం మౌనం తొంగిచూసింది!
ఆ తమావృత నీలాంబరంలో!
అంతలో - బ్రహ్మవర్చస్సుతో, భస్మత్రిపుండ్రంతో,
వేదమూర్తిలా, ఆదికవులు, నన్నయ భట్టారకులు
ముందుకొచ్చారు -
"ఆనాడు - గౌతమీ పావన తరంగాలు
నా భారత కవితా మాధుర్యంలో శ్రవణానందంతో
గట్టులు పొంగేలా పరవళ్ళు త్రొక్కాయి!
ఈనాడు - మీకుహనా భారతం వినలేక
శివతాండవం చేస్తున్నాయి!
ఈ ఆవేదనలో, ఏ లోకాల్లో పడున్న నన్ను
ఈనాడు - మీరు బలవంతంగా లాక్కొచ్చి

శిలావిగ్రహంగా నిలబెట్టున్నారు!
అందుకే నాకీ కన్నీళ్ళు!-"
అన్నారు వాగనుశాసనులు విచారంగా!
ఇంతలో, తిక్కన సోమయాజి, కవి బ్రహ్మయై
స్వర్ణ కుండలాలు, రుద్రాక్షమాలలూ వెలిగిపోతూ
వచ్చి నిలుచున్నారు ముందుగా -
"నా పెన్న - భీష్మ పర్వం విని గ్రీష్మంలో వెల్లువలై పారింది
నేడున్న పళాన - మీ కథాపర్వాలు విని - పినాకిని
ఇసుకతిన్నెలై, వట్టిపోయిన గోమాతలా విలవిలలాడుతుంది!
ఆ పినాకినీ తీరవాసుల పిపాసార్తికై
గ్రుంగిపోతున్న నన్ను తీసుకొచ్చి
ఈ రాతిగద్దె నెక్కిస్తున్నారు!
అందుకే ఈ దుఃఖాశ్రువులు!-"
అని ఘొల్లుమన్నారు కవిబ్రహ్మ తిక్కన్నగారు!
అల్లింతలో - స్ఫురద్రూపి, సాహితీ సమరాంగణ చక్రవర్తి
రాజసం మూర్తీభవించిన ఆంధ్రభోజులు
శ్రీకృష్ణ దేవరాయలు, ఠీవిగా ముందు నిలబడ్డారు!
"ఆనాడు - విజయనగర సామ్రాజ్యంలో
విపణి వీథుల్లో రత్నాలు, వజ్రాలు కుప్పలుపోసి అమ్మించాను!
సాహిత్యలోకంలో అనర్ఘకవితా రత్నాలైన
అష్ట దిగ్గజాలతో భువన విజయాలు చేయించి, తరించాను!
ఆంధ్రావనీ కీర్తిపతాక ఆకాశాని కెగరేసాను!
కానీ - ఈనాడు
తారురోడ్లపై రాళ్ళగుట్టలు పేర్చి, గలాటాలకు దారితీస్తున్నారు!
కర్షక లోకంలో 'అతివృష్టి-అనావృష్టుల' భువన విజయం చేయిస్తున్నారు
ఆంధ్ర కళా కీర్తిపతాకం అర్థాంతరంగా ఊపఊపలాడుతుంది
సాహితీ గగనంలో!

ఈ దుఃస్థితిని శిలావిగ్రహంగా నైనా
నే చూడలేనురా! కవీ!"
అని మౌన విషాద గంభీరమూర్తి అయినాడు సాహితీ పోషకుడు!
ఇంతలో - తంబుర మీటుతూ, చూపులు రామునిపై నిల్పి, కాంభోజి రాగంలో
కూనిరాగాలు తీస్తూ మెల్లగా వచ్చారు
నాదబ్రహ్మ త్యాగయ్యగారు!
"రసాత్మకంగా, సంగీత సాహిత్యాలని,
భక్తిపథంలో పోషించలేని, కళా దరిద్రులకూ
నిగ్రహంలేని, రాగానురక్తులైన మనుష్యులకూ -
నిలయమైన ఈ మహానగరంలో -
మాకూ విగ్రహాలెందుకయ్యా? రామయ్యా!"
అని విషాదగ్రస్తులై నిష్క్రమించారు సంగీతమూర్తులు, వాగ్గేయకారులు!
మఱింతలో హుక్కాపీలుస్తూ, నవాబు దర్జా వెలగబెట్టూ -
హుందాగా తెల్లగడ్డం నిమురుకుంటూ వచ్చారు
గోల్కొండ ప్రభువులు - తానీషావారు!
"సలామాలేకుం! క్యా భయ్యా!
మమ్మల్ని గోరీల నుంచి లేపి,
మా శాశ్వత నిద్రని 'ఖతం' చేసి,
'పునర్జన్మ' అన్న మాటేలేని
మాకీ శిలావిగ్రహ ప్రతిష్ఠా? ఎంత అప్రతిష్ఠ! బే!"
అంటూ కొనగోటితో కన్గొలకులలోని
కన్నీటిని మీటుతూ కదిలారు రాజదర్పంతో!-
"ఏ దేశచరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం?"
అంటూ సిగరెట్ పొగవదుల్తూ,
పెరిగిన గడ్డంతో, విప్లవాగ్నులు నుదుటను త్రినేత్రాగ్నిలా
వెలుగుతూ, ఠీవిగా ముందుకొచ్చారు శ్రీశ్రీ మహాకవిగారు!
"కామ్రేడ్! టాంక్‌బండ్ నిండా శిలావిగ్రహాలు!

రాంక్ విద్యార్థులకు మాత్రం శూన్య ప్రవేశాలు!
బ్లాంక్ అయింది నా కవితాస్రవంతి!
ఇంకిపోయింది నా విప్లవారుణాశ్రుఝరి!"
అంటూ నిట్టూర్చారు నిస్పృహాయంగా మహాకవి!
ఆ వెనుక, సామూహికంగా, సాను క్రోశులై -
"దుర్భిక్షంతో, అతివృష్టి, అనావృష్టులతో
వరదలతో, కరువు కాటకాలతో
'అన్నమో! రామచంద్రా!' అని అలమటిస్తూ
"సీళ్ళో నారాయణా!
పానీభరో! హే! అల్లా!'
వాటర్! వాటర్! మై డియర్ ఫాదర్!
చదువులూ, ఉద్యోగాలూ, శాంతి భద్రతలూ - కావాలి! కావాలి!"
అని ఆర్ద్రతతో విలపిస్తున్న దరిద్ర నారాయణులెందరో -
నిలువనీడలేక, అలమటిస్తున్న
ఈ విశాలాంధ్ర దేశంలో,
మాకెందుకీ శిలావిగ్రహాలు?
మాకెందుకీ కాంస్య విగ్రహ ప్రతిష్టాపనలు?
అని క్షోభిస్తున్న ఎందరో మహానుభావులు -
టి.వి. సీరియల్స్‌లో దృశ్యాల్లా, స్టిల్ ఫొటోగ్రఫీలా
సంతతాశ్రుధారలు కురిపిస్తూ, వింతగా పలవరిస్తూ
నా కనుముందు కదిలారు, దైన్యం రూపొందిన మనీషులై
ఆ వినీలాంబర రంగస్థలంలో!
మౌనంగా, విషాదంగా, అశ్రుసిక్తంగా!
ఆ విషాదశిల్పాశ్రుధారలు, ఆ శోక భావనా నదీనదాలు
మనో నిలయంలో, శోకజలపాతాలై స్రవించాయి!
వేదనా తీవ్ర నిర్ఘరులై దొరలాయి!
క్షణం నిర్విణ్ణునై

కనులు మూసాను!
అతి విషాద భరచిత్తంతో!
మళ్ళీ తేరుకొని, కాస్త తమాయించుకొని
కళ్ళెత్తి చూసాను!
ఆ నీలవినీల గగనాన్ని -
ఏముంది?
ఆకాశం, గగనం, శూన్యం!
మళ్ళీ దృష్టి ప్రసారించి, సాగర్‌ని అతి నిశితంగా పరీక్షించాను!
పైనంతా ముదురుపచ్చని నాచు!
చుట్టూరా భరింపరాని దుర్గంధం!
క్రిందంతా కలుషిత జలాలు!
అంచులెండిపోయి, నేలపగుళ్ళు బాజీ,
నిదాఘతప్త తటాకం
సుప్త భుజంగంలా పడి ఉంది! పాపం! హుస్సేన్‌సాగర్!-
మళ్ళీ తలత్రిప్పి చూసాను
ఏముంది?
త్రాగిన జోమ్మునే గ్రుద్దిన
తాండవ బాలకృష్ణ వీరవిహారం చేయగా,
అలసి, సొలసి అసువులు గోల్పోయి,
వెల్లకిలాబడ్డ పూతనలా
గోతులు త్రవ్విన, జూళ్ళుగుట్టలు నిండిన టాంక్‌బండ్!
నిశ్చేతనంగా, నిర్మానుష్యంగా, నిరామయంగా నిలిచి ఉంది!
పూర్ ఫెలో! టాంక్‌బండ్!
కళ్ళు గట్టిగా నులుముకొని చుట్టూ తేరిపార చూసాను
మళ్ళీ మళ్ళీ -
ఏముంది?
కాడెత్తు తటాక తరంగాల పొంగులులేవు!

వెల్లువై టాంక్‌బండ్‌పై, ముంపుల వంపుల్లేవు!
మూగిన జంటనగరాల గుంపుల సందడీ అంతకన్నా లేదు!
అంతా నిరామయం! అంతా నిశ్శబ్దం! అంతా శ్మశాన మౌనం!
ఓస్! ఇంతేనా?
అదంతా - ఒక భ్రమ!
ఇదంతా
శిల్పాశ్రువుల స్వప్నభ్రమ!

# కవితా! ఓ కవితా!

కవితా! ఓ కవితా!!
కోకిలారవ మాధురీ మనోజ్ఞతా!
తాపస హృదయ పరమ పునీతా!
అణిమాది సిద్ధుల్ని పణంగా తేలేను!
ప్రాణాయామాన్ని క్షుణ్ణంగా జరుపలేను!
కణ కణలాడే నిప్పుల్లో మిణుగుర్నై నిలువలేను!
వణికించే నిండు చలిలో తొణకక, బెణకక మనలేను!
మనస్సుని అదుపులో క్షణమైనా నిలబెట్టలేను!
ఊహా ఝరీతరంగం, కవితా భావనా జలపాతంలో
పడిపోకుండా నిలువలేను!
ఒంటికాలి మీద, మింటికేసి చూస్తూ
నిశ్చలంగా నిలబడలేను!
వసంతంలో రాగాన్ని, గ్రీష్మంలో విరాగాన్ని
వర్షాకాలంలో జలదోషాన్ని, శిశిరంలో శైత్యాన్ని
శరత్తులో శృంగారాన్ని, హేమంతంలో హిమపాతాన్ని
విడి, మనలేను! తెగబడి ముందుకు సాగలేను!
కవితారూపం తపస్సుగా,
భావనా బలం హవిస్సుగా,

గళస్థ వాగ్రూపం జ్ఞానరోచిస్సుగా -
కావ్య పరిమళం, రసజగత్తులనేలాలని,
నా మనోవేదనారవం -
ప్రతిభాసమన్విత ధ్వని ప్రపంచం నెలకొల్పాలని -
నా ఉక్తి వైచిత్ర్యం- -
ఔచితీ సమన్వయ పరాకాష్ఠ నందుకోవాలని, -
నా కవితావేశ ఝరీ తరంగశీకరం,
భక్తి రసరమ్య సాగరాల తేలిపోవాలని -
చేస్తున్నా
నీ కవితా తపస్సు!
నిరీక్షిస్తున్నా
భవతమోవిమోచనా
జ్యోత్స్నాలహరీ ఘులంఘులకై!

# చంద్రునికో నూలుపోగు

ఇది కాదు ప్రశంసాపత్రం!
ఇది కానేకాదు సన్మానపత్రం!!
ఇది నా హృదంతర భక్తిభావనా జలధి తరంగం!
ఈ ఏకలవ్యుని భావనావార్నిధి -
విశ్వనాథ శశాంకుని, శాశ్వత కవితా ప్రతిభాజ్యోత్స్నలలో -
పులకించి, పరవశించి, అల లలలుగా, తెలి నురుగులుగా,
పొరలింది సాహితీ సాగర తీరాలకు -
కెరలింది కావ్యానంద గగనాలకు!
'చెలియలికట్ట'తో చెలియలి కట్టనే దాటింది!
నా రసిక హృదయ సాగరం!
'వేయిపడగల' కథాకథన వైచిత్రితో
వేయి పరవళ్ళుపోయింది - నా జిజ్ఞాసాభుజంగం!
'భ్రమరగీతాల'తో, భ్రమసి పోయింది
నా అజ్ఞాన గోపికా హృదంతర భృంగం!
'కల్పవృక్ష'కమనీయ కావ్య పరిమళ మిళిత పవనంతో
అనల్ప సాహితీ ప్రపంచసూన సౌరభం వెల్లివిరిసింది -
నా మనో నందనోద్యాన పారిజాత ప్రసూనం!
ఇది కాదు - కేవలం కృతజ్ఞత!

ఇది కానేకాదు - మామూలు వినమ్రత!!
ఇది - నా యెదలోతుల్లో కదలాడే
ఒక అనన్య ఆదరాభిమాన సంస్నిగ్ధత!
ఇది - నా హృదంతరారామంలో తొణికిసలాడే
ఒక అపూర్వ గౌరవభావనా ఫల పరీపక్వత!!
ఒక మహాకవికి, ఒక కవిసమ్రాట్టునకు, ఒక ఋషికల్పునకు,
ఒక బహుముఖ ప్రజ్ఞాశాలికి, ఒక ప్రతిభావ్యుత్పత్తుల అసాధారణ
సమ్మేళనాజనిత రచనా ధిషణునకు -
'నహి' పాండిత్యం, 'నహి, నహి' కవిత్వం,
కేవలం 'అహం' మాత్రం నిత్యంగా ఎదలో మసలే -
శిష్యపరమాణువునైన, -
ఈ కుహనావచన కవిత్వం,
ఈ భావనా నిర్ఝరీ జలపాతం, -
చంద్రునికో నూలుపోగులా -
అందిస్తున్నాను
సంద్గంతో!!

# ఎందుకో? మఱి ఎందుకో?

ఎందుకో?
నాకూ - వేదనకూ - అవినాభావ సంబంధం!
ఎందుకో? మఱి ఎందుకో?? -
నాకూ - వేదనకూ - ఎడంద లోలోతుల్లో
ముమ్ముడులు పెనవేసిన పవిత్రానుబంధం!
భావనా తరంగ కురంగాలు
యువకావేశంతో పొంగిపొరలి గంతులేసేవేళ,
ఎదలపొదల్లో మాటుండి, 'నేను'న్నానని
గాండ్రిస్తుంది - వేదనా క్రోధ వ్యాఘ్రం!
గతస్మృతుల ప్రణయ మాధురీ పరీమళంలో మత్తెక్కి -
ప్రియురాలి గాఢ పరిష్వంగంలో వెచ్చగా ఒదిగిన
కమ్మనివేళ -
వార్ధక్య దశావిర్భావ, శిశిర సూచనా భుజంగ ఫూత్కారంలా
హృదంతర వల్మీకంలో దాగుండి నేనున్నానని
బుసలు కొట్టుంది ఆవేదనా భార సరీసృపం!
కవితాపుత్రికా కనీనికా జ్యోత్స్నా తరంగాల వెల్లువల్లో
వాత్సల్య ప్రఫుల్ల మానసంతో ఉవ్విళ్ళూరిన -
చల్లనివేళ -

బాధ్యతా తమో విమోచనా ఝుంఝూ మారుతంలా
నేనున్నానని, కెరటాల నువ్వెత్తుగా లేపి, రేపి, ఘోషిస్తుంది -
మనోసాగరంలో, వేదనా క్షీరసాగర మథన హాలాహలం!!
పురిటిలో, మాతృ ప్రసవ వేదనతో గొంతు కలిపి,
కెవ్వున అరచే, నెత్తురు గుడ్డు శిశురోదనంలా -
నా యెదలో బాల్యం నుంచీ ఉందేమో? దైన్యం!
అందుకే - వేదన నా చిన్ననాటి నేస్తం!
యౌవనంలో, సాహిత్య పరిచయ మధుమాసంలో మొగ్గతొడిగి,
పల్లవించిందేమో? నా గుండెల్లో, తీయతీయగా
వేదనా పరిమళంతో - విషాదరమ్య కవితా మకరందం!
అందుకే - తమాలవృక్షం, కృష్ణపక్షం,
ఆషాఢ నీలమేఘం, విరహిణీ దైన్యహృదయం
నాకత్యంత ప్రీతిపాత్రం!'
ప్రౌఢవయస్సులో, వ్రీడాభరయైన ప్రియురాలిలా,
లాలించి, ప్రేమించి, నన్నలరించిందేమో? ఆవేదనా వధూటి!
అందుకే - గాఢ తమోతనూ పరిష్వంగంలో పెనవేసుకొంది
మా వేదనా గీతికా ప్రణయానుబంధం!
ప్రొద్దు వాలుతున్న తరుణంలో, ముద్దుగా, ఒద్దికగా,
కులాంగనలా, చలికుంపటి వెచ్చనలో
తనూ, మనోవార్ధక్య భావనా సారూప్యంతో
వణకుతూ మఱీ దగ్గరైందేమో?
వేదనా స్వాధీనపతిక!
అందుకే - మానసిక పరీరంభంలో,
ఊహా మధుర రహోపగూహనంలో,
ముడివడ్డది మా స్వచ్ఛంద వినిర్మలానుబంధం!
ప్రేమా-ద్వేషం- కలగాపులగంగా పెనవేసికొన్న
విచిత్ర దాంపత్యం - నాదీ - వేదనదీ ?

ఎందుకో? ఒకప్పుడు ప్రేమగా, లాలనగా
ప్రియురాలి కంటికొనల తళుక్కున మెరిసే
ప్రణయమాధురీ విద్యుల్లతలా, గుండెలోతుల్లోకి
దూసుకుపోతుంది వేదనాంగనా ప్రియాపాంగలహరి!
ఎందుకో? - మరొక్కసారి, శిశువులా, అమాయకంగా
జాలిగా, బోసినవ్వుల్తో, కన్నుల్లో కన్నులుంచి,
వాత్సల్యపుటంచులని స్పృశిస్తూ, చిలిపిగా నవ్వి
నా యెదపై నిద్రిస్తుంది - వేదనా రమ్యసింహ కిశోరం!
ఎందుకో? వేరొకప్పుడు - మృగయావ్యసనంలో
శబ్దవేధి చాపవిద్యాగర్వంలో, ఏకాగ్రతతో
వేటను, తరిమి, తరిమి వెంటాడే మహాధన్విలా
గోచరిస్తుంది వేదనాక్రోశధ్వనిత కిరాతి!
నేనూ-వేదనా-ఖాస్ దోస్తులం!
నేనూ-వేదనా-ప్రాణాలిచ్చే ఆత్మబంధువులం!
నేను - ఆవేదనా - మనసిచ్చి పుచ్చుకొనే - ప్రేయసీ ప్రియులం!!
ఎందుకో? మాటి మాటికీ, మనోవల్మీకంలో
నిస్పృహావధులమేరలో, నేనున్నానని - తలెత్తి చూస్తుంది!
పడగెత్తి బుసకొట్టుంది! వేదనా దోదూయమాన పన్నగం!!
ఎందుకో? మళ్ళీ మళ్ళీ - ఎద లోలోతుల్లో
విచారసైకత కుహరంలో, త్రవ్వుకుంటుంది
ఆవేదనా భరిత భల్లూకం!
గతస్మృతుల యమునాసికతా తలంలో
నిరాశాభావ నిశీథినిలో విహరించే
నా మనో శ్యామసుందరునికి సైదోడుగా
చరిస్తుంది విషాదభావనా మధుర రాధిక!!
శోకమారుతీరవ తరంగితమైన - నా హృదయవేణువు
విషాదభరిత రమ్యరాగాలాపనే చేస్తుంది

ఆవేదనా పూర్ణప్రేయసీ మృదులాధర చుంబితయై!
నిస్పృహావధుల స్పృశించే
నా మనోవిపంచి -
దుఃఖాశ్రువులనే
సంగీత రసబిందువులుగా నినదిస్తుంది!
వేదనా ప్రియాంగనా
మనోజ్ఞాంగుళీ మృదుల మంజులస్పర్శతో!
ఎందుకో?
నాకూ - వేదనకూ
ఈ తీయని ప్రేమానుబంధం!
ఎందుకో?
నాకూ - విషాదానికీ
ఈ అనిర్వచనీయ
భావనాతీత
కవితానుబంధం!
ఎందుకో?
నాకూ - ఆవేదనకూ -
హృదంతరాంతరాలల్లో -
ఈ శాశ్వత ప్రణయానుబంధం!!
ఎందుకో?
మఱి ఎందుకో?!-

# మన విశాఖ

అదిగో! మన విశాఖ!
అదిగో! మన తొలితెలుగు వెలుగురేక!
చీకటి విరిసిన పొలాలను,
జ్ఞానకిరణ హలాలతో దున్ని
సస్యశ్యామలంగా, సమృద్ధిగా
పండించాను పసిడి పంటలు,
మిసిమి కాంతులతో విలసిల్లే
వెలుగురేకల చాళ్ళుగా!
ఈ కొండల్లో, ఈ కోనల్లో
ఈ సింహాద్రి సానువుల్లో
ఈ ఎగుడుదిగుడు విశాఖరోడ్లల్లో,
ఈ విశాల వినీల బంగాళాఖాతంలో,
చాళ్ళుగా దున్నిన ఈ తిమిరావృత ధరిత్రిలో,-
వేళ్ళూనే కాంతిబీజాలు
తమకంతో వెదజల్లాను!
పంటకొచ్చాయేమో?
కంటికింపుగా కనబడుతున్నాయి!
ఈ వెలుగువెన్నెల నవ్వులపువ్వులు!

ఊహలు గుండెనిండుగా,
మోహానికి ప్రతీకగా—
మెదలాడుతున్నాయి ముద్దుగా
ఈ ప్రొద్దు తిరుగుడు పువ్వులు
ఈ కొండచాళ్ళల్లో!
రంగురంగుల గులాబీ పూదోటలా,
గుప్పుమని పరిమళాలు వెదజల్లే సంపెంగ తరువుల్లా,
విరిసి, వికసించి, నవ్వే మల్లికా కుసుమ సమూహంలా,
వెలిగిపోతున్నాయి -
దిక్కుమాలిన ఈ విశాఖలో
అక్కడక్కడా, గుంపులు గుంపులుగా
ఎక్కడెక్కడో ఎడాపెడగా
విద్యుత్కాంతి లతాంతాలు
సద్యో వికసిత పుష్పగుచ్ఛాలు -
ఎలక్ట్రిక్ దీపాలు!
కోటిమంది దుర్మార్గుల్లో
ఒకే ఒక సజ్జనుడిలా
జిగేల్మని వెలిగిపోతుంది
ప్రగాఢమైన 'డాల్ఫిన్స్ నోస్'పై
ఆ 'లైట్హౌస్'!!
తన కాంతికిరణాలను,
సత్సంగ సందేశంలా
నలువైపులా విరియిస్తూ
వినీల సాగర తరంగాలను చుంబిస్తూ!!
'బ్రూటల్ మెజారిటీ'తో
గుమిగూడి, దబాయించే వాళ్ళదే -
ప్రజాస్వామ్యం!

అని ఎలుగెత్తిచాటేలా-
అరుణారుణంగా, నీలవినీలంగా
కంటికి కొట్టొచ్చినట్లు
మింటిలోని చుక్కలకి పోటీపడినట్లు,
ఊరంతా ఆక్రమించాయి, రోడ్లంతా పరుచుకున్నాయి
ఆ మెర్క్యురీలైట్లు!!
బీదా బిక్కీ, బడుగూ, పేదా,
ఇంకా అట్టడుగునే పడి ఉన్నాయని చాటిచెప్పేలా,
మినుకు మినుకుమంటూ, ఆరిపోతూ, మళ్ళీ వెలుగుతూ,
'స్లమ్' ఏరియాలలో, యల్లమ్మతోట చుట్టూ,
మురికి సందుగొందుల్లో - బిక్కుబిక్కుమంటున్నాయి-
మున్సిపాలిటీ గుడ్డి దీపాలు!
పైడితల్లుల ఒడిలో, అప్పలమ్మల గుడిసెల్లో!!
ఉక్కు కర్మాగారం అప్పటికింకా
నిక్కి నీలిగి, లెక్కలోనికి రాకున్నా -
చుక్కలంటుతున్నాయి ధరలు!
బిక్కుబిక్కుమంటున్నారు బీదప్రజలు అర్ధాకలితో!
సామాన్య మానవుని
నిత్య నికృష్ట జీవన సమరయాత్రా ఘోషలా -
దూరాన వినీల గంభీర సాగర తరంగరావం!
ఉవ్వెత్తుగా లేచిన,
క్రొవ్విన మదమత్తేభాల్లా దూకే
సాగర తరంగాలు -
అనాది నుంచీ కవ్వించి ఢీ కొడుతున్నా ఏ మాత్రం
చెక్కు చెదరని నల్లజాతి గుండెల్లా
మేధావులు, విప్లవసాహితీవేత్తల,
కళాకారుల, కవి కుమారుల

ఊహాంబుధీ తీవ్ర తరంగాలు -
ఉవ్వెత్తుగాలేచి, కవ్వించి, కవిత్వమై, శిల్పమై, రచనలై
స్తబ్ధ సమాజ శిలాత్వస్థితిని -
అనాది నుంచీ, ఆవేశంతో, ఆవేదనతో, ఆర్తితో
ఢీకొడుతున్నా - కించిత్తైనా చలించని,
కొంచెమైనా మారని, పుట్టు గ్రుడ్డి సంఘానికి -
ప్రతినిధిలా పడి ఉంది - మన విశాఖ!!
ఎగుడుదిగుడుగా,
వాల్టేర్ అప్‌లాండ్స్ నుంచి
రామకృష్ణ మిషన్ బీచ్ వరకు -
మిట్టపల్లాలుగా, నిట్టనిటూరుగా సాగే రోడ్లతో -
అట్టడుగున పడి ఉన్న బడుగువాళ్ళ ప్రతినిధిగా,
మెట్టెక్కిన మన పెద్దన్నల కోటబురుజుగా,
కనీవినీ ఎరుగని, వంకరలతో,
కన్ను పొడుచుకున్నా కనరాని చీకట్లలో
మునిగి తేలుతుంది - మన విశాఖ!!
ఘనంగా మార్పు లేని విధంగా,
కొండలూ, ఊాతిగుండ్లూ, ఘనాఘన నీలిమలూ,
వినీల సాగరజలాల్లో ప్రతిఫలించేలా -
కనాకష్టంగా బ్రతుకీడుస్తున్న,
అప్‌లాండ్స్‌లో రిక్షా త్రొక్క లేక చెమటోడుస్తున్న -
శ్రమజీవి ఆర్తనాదంలా -
పోర్ట్‌లోని స్టీమర్లు, నేవల్ డాక్ యార్డ్‌లోని సబ్‌మెరైన్‌లూ,
పోటీపడి చేసే సైరన్ల ఘోషలా -
ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థినీ, విద్యార్థుల
యువకావేశ మహాంభోధి తరంగరావంలా -
తూర్పున ఉత్తుంగ సాగరతరంగనాదాలూ,

పశ్చిమాన కొండల్ని క్రమ్మేసే కటికచీకట్లో,
కనుచూపుమేర దూరాన
భవితవ్యపు వెలుగులా, ఆశాజ్యోతిలా
'డాల్ఫిన్‌నోస్'పై లైట్‌హౌసూ -
అంతా -
'మినీ' ఇండియాలా ఉంది -
మన విశాఖ!
తెనుగువాడి ఫాలరేఖ!!

# నిశ్శబ్దనాదం

కాంక్రీట్ కీకారణ్యంలో,
సాంకేతిక విజ్ఞాన వైశిత్య గహనంలో,
ఊటుదేరిన కర్మాగారాలలో -
ఈట్లు వేస్తున్న సైరన్‌లని,
నిర్జీవయంత్రాల మూగరావాన్ని,
ఒళ్ళంతా - నల్లని తారొలికించుకొని,
బుసలు కొట్టే నల్లత్రాచుల్లా, సాగే రహదార్లలో
మూగే కారుహారన్లనీ -
లారీల నడన్ బ్రేకుల క్రీక్‌లనీ,
ఆటోల 'స్టార్టర్ ట్రబుల్స్'తో మ్రోగే తూటాల వ్రేలుళ్ళనీ,
గొఱ్ఱెలమందలా సామూహికంగా, బఱ్ఱెల గుంపులా అమాయకంగా, బద్ధకంగా,
ఏదో కొంపలు మునిగినట్లు, ఏదో గుడిసెలు రగిలి, మంటలు రేగినట్లు,
నిరంతరంగా తీరికలేనట్లు, అటూ ఇటూ సదా కదులుతూ,
ఘీంకరించి, అహంకరించి ముందుకురికే మదమత్తేభాలల్లా
కదిలిపోయే - ఈ అసంఖ్యాక జన సందోహాల -
సంభాషణా భీషణ నాదాలనీ -
అర్ధరాత్రైనా, సద్దుమణగని 'బార్'లలో వినిపించే 'డిస్కో' సంగీతాన్ని

నగ్ననృత్య శిఖరాయమాణులైన, 'కేబరే' డాన్సర్ల దీనార్తరావాలని,
పడుపువృత్తిలో, కడుపు మాడినా,
కామాంధులకు దేహమప్పగించి, నిస్సహాయంగా, మౌనంగా
హృదయ విదారకంగా లోలోన కుమిలి కుమిలి యేడ్చే
దగాపడ్డ చెల్లెళ్ళ గుండె కడలి ఘోషనీ, -
వినివినీ, చూచి, చూచీ, తలచి, తలపోసీ,
పిచ్చెక్కి పరువెత్తాను,
నిశీధినీ హృదయాంతరాళాలలోనికి!
అగాధ తిమిరావృత మహారణ్య మధ్యంలోనికి!
మానవులన్న మృగాలు లేని,
నిశ్శబ్ద రమ్య గహనాంతర సీమల్లోనికి!

# ఎండ! ఎండ!! ఎండ!!!

అబ్బా!
ఎండ! ఎండ!! ఎండ!!!
కుండపోతగా కురుస్తోంది ఎండ!
కుంభవృష్టిలా వర్షిస్తూంది ఎండ!
అశనిపాతంలా విరుచుకుపడుతూంది ఎండ!
అబ్బా!
ఎండ! ఎండ!! ఎండ!!!
మింటి నుంచీ మంటికీ ఏకధారగా
దివాకరుణ్ణుంచి దిగ్దిగంతాలకు
దవానలశిఖల్లా, నిట్టనిటారుగా
దూసుకుపడుతోంది ఎండ!
ఆకైనా కదలదు! కాకైనా అరవదు!
శ్మశాన నిశ్శబ్దంలా క్రుమ్మరిస్తోంది
వేసవిలో ఈ మండుటెండ!
ఊపిరిలో సెగలు, తాపంలో పొగలు,
కార్చిచ్చులా నేలంతా వ్యాపిస్తూంది - ఈ ఎండ!
తనువంతా ఎండ! మనసంతా బండ!
తటాకాలల్లో, తరంగిణులల్లో,

ఏళ్ళల్లో, సెలయేళ్ళల్లో,
అగస్త్యుని ఔపోశనలా
హరిస్తోంది జలాన్ని - ఈ ఎండ!
వడలిపోయిన ఈ బడుగు జనాల దేహాల్లో,
బడలిపోయిన, ఈ అడవి జంతువుల శరీరాలల్లో,
అపహరిస్తుంది - స్వేదజలాన్ని ఈ ఎండ!
లోకంలో, నీరంతా కరిగి, ఇంకి, ఆవిరై
మబ్బుల్లో తేలి కలిసిపోయిందేమో?-
చుక్కైనా మిగల్లేదు - ఈ భూ ప్రపంచకంలో!
ఇంత దాహం తీర్చుకోడానికి,
గుక్కెడు నీళ్ళు గొంతుక తడుపుకోడానికి,
చెంబెడు నీళ్ళు నెత్తిన పోసుకోడానికి,
దేనికీ -
కనిపించడంలేదు ఈ ధరిత్రిలో
నీటిబొట్టు! మీపైని ఒట్టు!!
అయ్యా! మాకు
ఉపన్యాసాల వర్షాలొద్దు!
వాగ్దానాల ఉప్పెనలొద్దు!!
రాజకీయ కుతంత్రాల ఝుంఝూమారుతాలొద్దు!!!
గుక్కెడు చల్లని
మంచినీళ్ళతో మా గొంతుక తడపండి!
చిక్కని మజ్జిగనీళ్ళు, కాసింత ఉప్పేసి,
చుక్కెడు గంజినీళ్ళతో కలిపి
మా మొహాన కొట్టండి!

చల్లని మెల్లని పిల్లగాలులతో
చక్కని వాతావరణం

మా ఉనికికి కల్పించండి!
అయ్యా! దాహం తీర్చండి!
అమ్మా! దప్పికలార్పండి!
బాబూ! నిప్పులు చెరగకండి!!
అబ్బా! ఎండ!ఎండ!! ఎండ!!! –
ఈ నడివేసవి నిప్పుసెగలకు,
పుడమిలో నీరంతా కరిగి ఆవిరైనా పరవాలేదు!
నోరెండి, తడారిపోయి, నాలుక పిడచ కట్టి,
గొంతు డగ్గుత్తికపోయినా – మరేం పరవాలేదు!
ఏరులింకి, మెట్టలేసి, ఇసుకపర్రలే మిగిలినా పరవాలేదు!
చెరువులెండి, పొట్టలో కుళ్ళంతా వెళ్ళగక్కినట్లు
నేలంతా బీటలు వారినా – ఏమీ పరవాలేదు!
నల్లనిత్రాచుల్లాంటి తారురోడ్లు,
ఈ మండుటెండలకు కరిగినీరై, లావాలై
తెల్లని విషం పొగలై నురుగులు గ్రక్కినట్లు
విరుసుకున్నా – ఏమేమీ పరవాలేదు!
కనుచూపుమేర ధరిత్రి అంతా, మరిగే నూనె నురగలా
ఆవిరులతో తుకతుకలాడించే
ఎండలు పరుచుకున్నా, విరుచుకున్నా – మాకేం పరవాలేదు!
కానీ –
ఈ మండుటెండలో –
ఆలోచనామృతాన్ని పంచుకొనే ఈ చిన్నిబుర్రలో, –
ఊహాగానం చేసే ఈ మేధః తరంగిణిలో
రసోత్పాదనా కవితాజలం
ఇంకిపోకుండా ఉంటే – అంతేచాలు!
ఈ వసంత కాలాంతానికి
బుద్ధి కుసుమం, ఎండి వాడిపోకుండా వికసిస్తే చాలు –

మాకదే పదివేలు!
ఈ గ్రీష్మాతప తీక్షానికి, భావనా విహంగం సురిగి పోకుండా
సాహిత్య గగనంలో విహరిస్తే చాలు - మీకు శతసహస్ర వందనాలు!
ఈమనో, మేథోదహనం చేసే రాజకీయ సాంఘిక, సాహిత్య విప్లవ
గ్రీష్మోష్మానికి తట్టుకొని నిలబడగలిగితే చాలు - మీకు కోటి కోటి నమస్కారాలు!

అయ్యో! ఎండ!
అమ్మో! ఎండ!!
అబ్బా! ఎండ!!!-
ఎండ! ఎండ!! ఎండ!!!-

# ఎండమావులు

కుంచిస్తుందీ వంచనా సూత్రం
మంచిగా ఎగరాలంటే!
వంచిస్తుందీ అంచనా లేని బంధం
కంచెయే చేను మేయాలంటే!
ఒద్దంటుందీ హద్దులు గీసే 'మాంజా'
పెద్ద పెద్దగా పైకెగరాలంటే!
హద్దంటుందీ పద్దులు వ్రాసే వాలం
ముద్దు ముద్దుగా నింగి దాకాలంటే!
అజ్ఞాన మంటుందీ అజ్ఞాతహస్త సంబంధం
జిజ్ఞాసాంబరాల చుంబించాలంటే!
అజ్ఞాతమంటుందీ ప్రజ్ఞాభరిత నయన సంరంభం
జిజ్ఞాసారోచిస్సులందు కోవాలంటే!
ఎందుకీ బంధం? ఎందుకీ సూత్రం?
ఎందుకీ వాలం? ఎందుకీ అజ్ఞాతహస్త దర్శకత్వం?
అందుకే - ఈ బంధాలు ఛేదించాను!
ఆత్రంతో ఈ సూత్రాలు విచ్ఛిన్నం చేసాను!
వాలాన్ని - కరవాలంతో ఖండించాను!
అజ్ఞాతహస్తాని కందకుండా

జిజ్ఞాసాభర ముముక్షువునై
గగనానికి ఎగిరాను -
మిగిలిన బంధాలను నగంలోనే వదిలేసి!
ఆకాశానికి లంఘించాను -
సాకారమైన సూత్రాన్ని ప్రాకారాగ్రంలో దిగజార్చి!
చుక్కలకై చెక్కలల్లార్చాను -
చక్కనైన మంటి ముక్కువలన్నీ
దిక్కులేనివిగా దారిలోనే వదిలేసి!
ఇప్పుడు -
నా భావనా పతంగం - విమోచనాభావ విహంగం!
నా ఊహా పవన గమనం - నిరంతర ఊర్ధ్వప గమనం!
నా జీవన రథ సంచలనం - నిత్యనూతన పథగవేషణం!!
తెలిమబ్బు దొంతర్లలో - సలిలముంటుందని,
నీలి మబ్బు తునకల్లో - నైల్యముంటుందని,
భ్రమసి -
దూదిపింజెల్లా - దూరదూరంగా పరుగెత్తే
మబ్బుతెరల్లో దూరాను!
తెలుపు, నలుపు భేదమేలేదు
ఒలికించాయి రెండూ - బొగ్గుపులుసు వాయువుల్ని!
ఊపిరాడక, కోపమాగక,
వియత్తలాని కెగిరాను - రయ విచలితుణ్ణయ్యాను!
తోకలేని పక్షిలా - నూకల్లేని ప్రాణిలా!-
కనుచూపుమేరలో - మిణుకు మిణుకుమన్నాయి తారకలు
వెలుగంతా - నా సొంతమౌతుందని
తెలివంతా- దిగ్దిగంతాల వ్యాపిస్తుందని,
ధ్రువతారనౌతానని - ధ్రువ కీర్తి నొందాలని,
లంఘించాను - పక్షిలా నక్షత్రాలలోనికి!

మిఱుమిట్లు గొలిపాయి! - చిఱుచెమటలు పోసాయి!
ఆ కాంతిసంద్రాల వెల్లువలు - ఆ భ్రాంతి తేజో ప్రభంజనాలు!
ఉన్న రెండూ కళ్ళు సున్నలై - మిన్నులో చూపులే శూన్యమై
పుట్టుగ్రుడ్డినై, తిట్టుకుంటూ - మరలాను
విశ్వ విహారయాత్రలో,
తరలాను - కొట్టుకుంటూ - నష్టజాతకునిలా!
అందాలప్రోవులా - ఆనందాల పెన్నిధిలా
చల్లదనాలను వెల్లువలుగా పెల్లుబికించే
చందమామలో విందు చేద్దామని,
సందులోనే ఉన్న కల్పవృక్షమని,
అందుకోబోయాను ఆత్రంగా!
ఊళ్ళనే గడ్డ కట్టించే, కీళ్ళనే పట్టు వదిలించే
అతి శీతలత్వం, అత్యుష్ణత్వం -
పంచప్రాణాలను మంచులో ముంచే
నిర్జనత్వం, నిర్జీవనత్వం -
అంచనా వేయలేక, కొంచెమైనా నిలువలేక,
దారితెన్నూ తెలియని పథికునిలా
జారుకున్నా చల్లగా, నిరుత్సాహంగా -
గగన సంచారంలో - నికృష్ట జీవినై!
ఓజోగుణ ప్రధానమై, తేజోవధీభూతమై
కర్మసాక్షిగా, ధర్మమూర్తిగా
ప్రాక్పశ్చిమ దిగంతాలను, ప్రాపంచిక విభవాలను
వెలిగించే, వెలయించే - భానుతేజాన్ని
తేనెలా జుర్రుకొందామని - పరుగెత్తాను
అరుణారుణ తేజోసాగర గర్భంలోనికి!
చుట్టూరా ప్రళయాగ్ని జ్వాలలై,
అట్టడుగున అత్యుష్ణఝంఝులై

మహానలాజ్వాలా పరివేషమై
మహోగ్రతేజో దుర్నిరీక్ష్యమై
సర్వచరాచర వస్తు భస్మీభూత భయావహమై
సర్వజీవ సంహార రౌద్రాత్మక వి్రాడ్రూపమై -
ఎత్తెత్తుగా పెనుమంటల్తో,
గుడ్లెత్తి జేసినట్లు కసికసిగా జూస్తున్న -
ఆ మహాభీకర సూర్యగోళంలో -
కాల్నిలుపలేక, వెళ్లిందుకోలేక -
కళ్ళు మిర్మిట్లు గొల్పగా,
వళ్ళు డైనమైట్లు ప్రేలినట్లు సలసలా మరగగా -
'బ్రతుకుజీవుడా!' అని బయటపడ్డాను
కణకణలాడే, సెగలతో పొగలతో కుతకుతలాడే - ఆ మహాద్భుత విస్ఫులింగం
భానుబింబం నుంచి -
సతమతమయ్యాను - గతస్మృతులు పీడకలల్లా!
ఇప్పుడు - నేనొక -
రగిలిన జ్వాలాముఖిని ! మిగిలిన వేదనా శిఖని!
గగనాల విభ్రాంతితో పరిభ్రమించే - దిగంబరరూపసంచారిని!
అగణితతారకాపథ పద్మవ్యూహగత - స్మృతివిహీనుణ్ణి!
జీవన కురుక్షేత్రంలో - భావోద్వేగ ఘీంకృతిలో,
కౌరవాధర్మ సమరాంగణంలో,
కౌరవాచార్య కుహనా వ్యూహాంతరంగంలో -
విభగ్నమైన ఘోరధర్మాన్ని - అభినవ వీరాభిమన్యుణ్ణి!!
తెగిన గాలిపటాన్ని! వగజెంది, నేలగూలిన పతంగాన్ని!
కనలేని వేదనలో - గుండె ఎరువులు!
కనుచూపుమేరలో - ఎండమావులు!!
నా పతనం - అధోలోక గమనమై,
నా పతితతం - అధమాధమ పతనమై,

ఊహాతీతమైన శరవేగంతో,
ఊహాభరమైన శిథిల శరీరంతో,
వ్రాలాను తోకచుక్కలా!
వ్రీలాను విగతప్రాణిలా!!
నగమై ఒగర్చాను వగపులు నిండి గుండెల్లో!
ఖగమై దిగజారాను నిస్పృహతో గగనాల నుండి!
అంతలో -
నింగిలో లేని సంబరాలు తొంగిచూచాయి -
నేల కనుచూపు కందగా - జలము కనువిందు చేయగా!
లేతచిగుళ్ళు నవ్వాయి - ప్రాతఃకాల సిత కాంతిలో,
తెలిమల్లెలు వికసించాయి - తొలివెన్నెల మధుర మందహాసంలో,
స్నిగ్ధంగా విరిసాయి జ్యోత్స్నలు - ముగ్ధ శిశు మందహాసంలో,
కిలకిలా రావాలు వెలిసాయి - కలకంఠి కంఠకుహూ కుహూ నాదంలో,
ఎటుచూచినా వెల్లివిరిసింది - ఆనందసాగర తరంగం!
ఎటు కదలినా పెల్లుబికింది - ఖేదజలధీ తరంగ శీకరం!!
వగపులూ, నగవులూ - కలగా పులగంగా,
ఆశలూ, నిరాశలూ - సమపాళంగా,
మానవత్వ బలహీనం-మనుగడకే జీవం!
మన్నును పెనవేసిన - చిన్ననాటి మమతానుబంధం,
నేలనంటిపెట్టుకొన్న - కేళీవిలాస రక్తసంబంధం -
మిన్నులో పూర్తిగా లీనంగానీక,
మన్నుకూ, మిన్నుకూ సూత్రబంధంగా,
మింటికీ, మంటికీ కంటికందే మేర
చలత్ జీవనాధారంగా -
మానవజీవన సంబంధం - అజ్ఞాత హస్త దర్శకత్వంగా,
సురలోకసౌఖ్యం -
అరుణాంబర పథంలో - చిరుగాలికి సంచరించే పతంగంగా,

జ్ఞాతానికీ, అజ్ఞాతానికి - కనిపించీ కనుపించని
అవినాభావ సంబంధంగా -
విచ్చలవిడియైన స్వేచ్ఛతో - అచ్చేసిన ఆంబోతులా
పచ్చని జీవనాన్ని - మచ్చుకైనా లేకుండా చేస్తుందని -
ఏదో కొంతహద్దు - ఏదో సుంత బంధం - ఏదో వింత సూత్రం -
నాదైన స్వేచ్ఛా పథానికి బాధాకరం కాకుండా
వాదోపవాదాలకు తావీకుండా, సూత్రప్రాయంగా - నేత్రపర్వంగా,
మెలగాలని, - ఎండమావులకు భ్రమింపక, పండంటి కలలకు చలింపక -
తిరిగీ ఎగిరాను - సురక్షిత సూత్రంతో, తరుగులేని మెఱుగుల, గగన విహంగాన్నై!
మరలా ఎగసాను -
మంటిపై మరులుగొని - మింటిలో వెలిగే పతంగాన్నై!
భావనా స్వాతంత్ర్య కుసుమకోమల
దివ్య పరిమళాన్నై!
జీవచైతన్యలహరీ నవశీకరాన్నై!!
శ్రీ విద్యామహామంత్రసాగరాన్నై!!!-

# చీకటి పిలుపు

ఘూకాలకు - భేకాలకు, ఖగరాజుకు - భుజగాలకు,
గృధ్రాలకు - క్షుద్ర విహగ సంతతికీ, నిద్రాళులకు - నిర్నిద్రులకు
హరిణానికి - చిరుతపులికీ, హర్యక్షున - కిభరాజుకు,
ఘోరవిపిన మధ్యంలో - క్రూర జంతు సాన్నిధ్యంలో
అర్ధరాత్రి - ఆషాఢపుటమావాస్య,
స్పర్ధ - మైత్రి - విషమ సమస్య -
తాడోపేడో తేలాలని, వాడవాడ కలవాలని,
లలిత చలిత పవమానములై - చలిత పత్రనయనాంచలమై
చీకటి పిలిచిందట ! ఆకలి వెలిగిందట!!
హర్యక్షుల అధ్యక్షతలో - సర్వజంతు సమక్షంలో
ధర్మ సూక్ష్మ విచారణ - జీవకోటి జాగరణ!
అభియోగం తెలుపుమన్న - సభికులలో చులుకుమిన్న -
మర్కట మెదిరించి పలికె -
"తొలిమానవ దశల వెలిగి - ఇలనేలిన మాకు వగపు!
శాఖాచంక్రమణమేటి తగవు?"
హరిణమ్మది, చలితగాత్ర అరుణారుణ రూక్షనేత్ర -
"మా గడ్డిని మేము గఱవ - మీకూడై తనువు లొఱుగు!"
చిత్తస్థైర్యపు మదమత్తేభము

హత్తిన హృదయావమాన ఘీంకారము -
"తామర తూండ్లను నమిలెద! - నామీద ప్రచండత దుమికెదు?"
"దొరికీ దొరకని తిండిని తిని,
అరచేతను ప్రాణాలతో, అర్ధాకలితో
కలుగులలో తలదాచిన,
ఎలుకల వెలికి లాగి కబళించెడి సరీసృపము?" —
అన్నియు నాపన్నత నొందిన మృగమ్ములు
కన్నులలో నిప్పులుమిసి,
ఐక్య కంఠనాదమ్ముల, విప్లవ శంఖారావమ్ముల బూరించుచు -
"అజ్ఞానపు తిమిరమ్ముల మమ్ముముంచి
విజ్ఞానపు వెలుగులోన మునిగితేలు
మీధాష్ట్యము చెల్లదింక! మీ దండన మొల్లమింక!
స్వాతంత్ర్యము మాకందక - సమభావన మాకందక.
మన్నునబడి చెన్నుదఱిగి, ఛిన్నులమై వెన్ను వంచి
దాస్యమ్మున మనజాలము! హాస్యమ్మున కీక తాళము!
దళితజాతి విరళితమై పొంగెనిపుడు!
పతిత వర్గ మవిరళమై నెగసెనిపుడు!
మా నెత్తుట వేడి సెగలు! మా కుత్తుక వాడి పొగలు!
మా నరనరాల భీకరాగ్ని! మా ఎడదల బాడబాగ్ని!
దీనజంతు క్రోధవార్ధి వెల్లువలై పొంగెనిపుడు!
గుప్తమైన అవమానము దావాగ్నిగ రగిలెనిపుడు!
ఎదురులేని ఈ వాహిని చదును చేయు మీ పోకిళ్ళను!
ఎదలోతుల గుదిలించెడి నన్యాయము
మది లోతుల గదలించెడి విప్లవమ్మె -
దావానల భావమ్మునె - ఝంఝానిల రావమ్మునె
చీకటి పిలిచిందట! - ఆకలి వెలిగిందట!!-"-.
అలా కేకలేస్తూ మూకుమ్మడిగా కదిలాయట!

మహారణ్య మధ్యంలో అసహాయశూరులై!
తోకనెత్తి పిల్లి గంతు చెవులపిల్లి
నిర్భయముగ మూకముందు నడిచిందట!
నల్లనైన గళమునెత్తి శోకముక్తకంఠానను
కాకమ్మది పాడిందట!
దళితవర్గ చలత్ భ్రుకుటి గగనాలలో సంచలించి
పికమ్మొకటి గృధ్రపక్ష విక్షేపము లొలికిందట!
అసమర్థుని హృదయాటవి చెలరేగిన క్రోధవహ్ని
దారితెన్ను తెలియలేని సుడిగుళ్ళుగ—
లేడి కళ్ళలోన చెంగు చెంగు పోయిందట!
బంధముక్త యూథశక్తి ఘీంకరించి
ప్రజాశక్తి తుండాలతో చండోగ్ర
ఝరీ ప్రవాహ ధార జిందిందట!
పొందిన స్వేచ్ఛా వాయువు, చిందిన స్వాతంత్ర్యమధువు
పిల్చాలని, గ్రోలాలని, చెట్టు చివర నిలవాలని
వీరరూప చిహ్నమ్ముగ, ధీరభావయత్నమ్ముగ
వృక్షాగ్రపు కిచకిచలై, ఝూక్షాభ్రపు మిసమిసలై
కోతులెల్ల - జయపతాకా రీతు లొంచు ఎగిరాయట!
నిలువులోతు పూడ్చబడ్డ
సిలుగులన్ని వెలికి వచ్చి
అణగారిన క్రోధాగ్నులు
మిణుగురులై వనములెల్ల
దహియింపగ వచ్చినట్లు,
సహియింపక హెచ్చినట్లు,
ఏకముక్త కంఠమ్ముగ
శోకముక్త నినదమ్ముగ -
దీనజంతు సమూహమ్ము

పీడిత జన విమోచనమ్ము -
న్యూన భావసంహరణమ్ము -
పాలకజన మర్దనమ్ము - చేసినట్లు -
ప్రజాశక్తి వెల్లువలై,
స్పందనశక్తి కొల్లలునై,
సమభావం - స్వాతంత్ర్యం
ఒమరిన ప్రజారాజ్యం -
ధ్యేయమ్ముగ, న్యాయమ్ముగ -
కదిలిందట వాహినులై !
మెదిలిందట స్రోతస్సులై !!
వెలుగు పొంగు నిలవాలని
తిరుగుబాటు పెరగాలని,
చైతన్యం
నరనరాల విజృంభించాలని,
సంచలనం
రక్తధమనుల వెల్లువ గావాలని,
ఏకసూత్ర బంధమ్ముగ,
ఐక్యకంఠ నాదమ్ముగ -
చీకటి -
పిలిచిందట!!
ఆకలి -
వెలిగిందట!!!

# పునర్జన్మ

మళ్ళీ మొదలెట్టాను
కిళ్ళీ నముల్తూ-పదయాత్ర సాగించటం!
మరలా ఆరంభించాను
సరుకుల సంచి చేతబట్టి-పరుగులెత్తటం!
సరాసరి బేరాలకు దింపాను
మరీ మరి పెరిగిన ద్రవ్యోల్బణాన్ని!
ఉండుండి మూసేశాను గ్యారేజిని -
గుండె చెఱువయ్యే ఇంధన మూల్యాన్ని వెచ్చింపలేనని!
కట్‌షార్ట్ చేసాను సోషల్ కాల్స్‌ని!
పిట్టకథలతో హిట్ చేసాను ఫామిలీ సర్కిల్స్‌ని!
పొల్యూషన్ దావాగ్నిని చల్లార్ప యత్నించాను!
సొల్యూషన్ - పల్లీయ జీవనపథమేనని తలంచాను!
అరలరలుగా కూరాను ఆక్సిజన్‌ని -
మరామత్తులో నున్న ఊపిరితిత్తుల్ని బ్రతికించాలని!
కన్నూమిన్నూ గానని ఆడంబరాలకు స్వస్తి జెప్పాను!
ఉన్నంతలో ఉప్పుజావ్వేసిన గంజే 'తథాస్తు' అనుకొన్నాను!
పబ్లిక్‌పార్క్‌లోని గడ్డిపూల సౌందర్యాన్ని విసర్జించాను!
దొడ్డిలో పెరిగే బొండుమల్లెల తెలివన్నెల

సహజ సౌరభాలని ఆదరించాను!
సభ్యతా సంస్కారాల కాణాచి -
కులసతీ వినయ గుణ సౌందర్యాన్ని స్మరించాను!
తిరిగీ పలికాను - నాంది -
కనుమొఱగిన ఆధ్యాత్మికా చింతనకు!
అంతంతలో వదిలేసాను - బహిర్ముఖత్వాన్ని!
చింతా చీకూ లేక చేపట్టాను - అంతర్ముఖత్వాన్ని!
పెట్రోల్ షార్టేజి - మనుగడకు 'రిట్రోగ్రేడ్' స్టెప్ కాదనీ,
పెరిగేగిన ధరలు - జీవితాన్ని చట్రంలో బంధింప లేదనీ,
పంచభూతాల పవిత్ర ప్రకృతి - వంచన చేయబోదనీ,
విద్యుదింధన శక్తులు కరవైనా, లుప్తమైనా,
సహజవనరులు పుష్కలంగా లభిస్తాయనీ,
సద్యోతేజః భానుడీ తెలుగుగడ్డపై - ఇంకా అస్తమింపలేదనీ,
కుంచింపబడ్డాయన్న వనరులు -
మంచినే సంకల్పించాయనీ, -
మళ్ళీ మళ్ళీ మొదలెట్టాను -
కుళ్ళూ గిళ్ళూ లేని
నిర్మల నైసర్గిక మానవ జీవితాన్ని !! -

# మగువ మనసు

ముగ్ధ :

పరికిణీ వోణీల పసితనంలో
పరిణీత మనో్జ్ఞనయ్యాను!
విరిసీ విరియని యౌవనంలో
వివాహబంధితనయ్యాను!
తెలిసీ తెలియని సతీత్వంలో
మాతృత్వమొంది, సంతానవతినయ్యాను!
మామగార్ల మందలింపుల్లో, మరుదుల సాధింపుల్లో
ఆడబడుచుల అవహేళనల్లో, అత్తగార్ల అదిలింపుల్లో,
శ్రీవారి చిఱుకోపంలో, చిన్నారి పాపల పెంకెతనంలో
అత్తిల్లన్న అడకత్తెరలో - పుట్టింటికెళ్ళలేని సందిగ్ధంలో
దారిద్ర్యమన్న దావానంలో నలిగాను నేను!
మధ్య తరగతి జీవన మందహాసం కరువై, బరువై పోయాను నేను!
సంసారపు పొగలలో కుమిలాను నేను!
కూపస్థ మండూకంలా, కుక్కిన పేనులా
ఆంక్షలెక్కువై, కాంక్షలు తక్కువై
పరదాలు దట్టమై, సరదాలు మట్టమై

మందహాసాలు భారమై - మమతానురాగాలు దూరమై
కన్నీళ్ళు కాల్వలై, చెక్కిళ్ళు పల్లనై
మూడ్రై దాటక మునుపే - ముదుసలినయ్యాను!
చెప్పా చెయ్యకముందే - చెయ్యి గాల్చుకున్నాను!
ముద్దరాలిని నేను - పొగచూరిన నిలువుటద్దాన్ని నేను!
ముద్దరాలిని నేను - ముకుళిత విషాద మందారాన్ని నేను!
ముద్దరాలిని నేను - అవ్యక్త వేదనాభావ సాగరాన్ని నేను!
ఇలా -
పసితనంలోనే పెళ్ళై - జీవితారామంలో వసివాడిన
నారీ కుసుమాలకు - ఏకైక ప్రతినిధిని నేను!

ప్రౌఢ :

పరికిణీ వోణీల పసితనంలోనే- బండెడు పుస్తకాలు మోసాను నేను!
విరిసీ విరియని యౌవనంలో
విచ్చలవిడిగా తిరిగాను నేను!
రెండు జడలతో - చేతిలో రెండే రెండు పుస్తకాలతో -
కాలేజి కల్లా చలాకీ పిల్లని నేను!
అత్తా ఆడుబిడ్డల పోరూ -
మరిదీ, మామగార్ల విసురూ -
అపెండిసైటిస్‌లా హజ్బెండూ -
ఆస్త్మాలా సంతానం -
ఇవేవీ -
కలలోనైనా తలంపని
కమనీయ స్వేచ్ఛాజీవిని నేను!
వేనిటీబ్యాగ్‌తో, విజిటింగ్ కార్డ్‌తో
'వైరైటీ ఈజ్ ది స్పైస్ ఆఫ్ లైఫ్' అనే
సొసైటీగర్ల్‌ని నేను !

కానీ -
విద్యావతినై - అవినయాన్ని
ఉద్యోగినై - నిరుద్యోగాన్ని
ఆర్జనా పరురాలినై - అహంకారాన్ని
స్వతంత్రనై - అసమానత్వాన్ని
పోషిస్తున్నాని - రోషిస్తున్నారు, ఘోషిస్తున్నారు -
పురుష పుంగవులు ! -
ఈసుతో, దురుసుగా మూతి ముడుస్తున్నారు
అమ్మలక్కలు!!
ఇన్నేళ్ళొచ్చినా పెళ్ళింకా కాలేదని -
కళ్ళెజ్జి జేసారు!
ఒంటరిగా నడిస్తే - తుంటరులై వెంటాడతారు!
అందంగా కనిపిస్తే చాలు - అలా కళ్ళతోనే, తినేస్తారు!
వనిత - విలాసానికే గాని - వివాహానికి కాదంటారు!
ఒంటరిగా బ్రతకనీరు - జంటగా రానంటారు!
పెళ్ళిపేరు చెప్తే - పత్తా లేకుండా పరారయిపోతారు!
చదువుకొన్నాను నేను - చక్కదనాల చుక్కని నేను!
ఉద్యోగం వెలగబెట్టున్నాను నేను - ఊళ్ళేలుతున్నాను నేను!
సంపాదనాపరురాల్ని నేను - స్వతంత్ర భావనా బలమున్నదాన్ని నేను!
అయినా ఏం లాభం?
తోడు లేక జీవితం బీడుపడింది!
మనసు తెలిసి మసలే మనిషి లేక
ఒంటిగా కంటక పథాల్లో
జంటలేని నా జీవిత గమనం
కుంటుపడింది!
ఏదో తెలియని వెలితి
నా జీవనపథంలో తారాడుతుంది!

అందుకే -
మనసెఱిగిన మనువు జీవితవనంలో
మల్లెలు పూయించాలని -
నా విషాద విధుర గద్గదగళాన
వసంతకాల పుంస్కోకిల కూయాలని -
తడాఱిన, దప్పికగొన్న నా మృదులాధరాలపై
ప్రణయ మధువుచింది, చుంబించాలని -
సమభావం, సహృదయం, సౌకుమార్యం - ఒలికే
జీవన కుసుమ సౌరభం కావాలని -
స్వేచ్ఛా - పరతంత్ర్యాలు, బరువు - బాధ్యతలు
జీవిత భాగస్వాములిద్దరివీ కావాలని -
మోదాలూ, విషాదాలూ - కన్నీళ్ళూ, పన్నీరులూ
సమంగా దైనందిన జీవితంలో పంచుకోవాలని, -
స్వగతంలో - ముగ్ధ శిశుమందహాసం - మాతృత్వానికి
సుస్వాగతం పలకాలని -
ఎక్కువ తక్కువలు లేని, పొరపొచ్చాలు లేని
వలపుల ఏకత్వాన్ని -
అభిన్నమైన, అనన్యమైన, అవధుల్లేని
ఆత్మీయతని -
నదీసాగర సంగమంలా - ఎదలోతుల్లో
అపూర్వ ప్రేమామృతం ప్రవహించాలని -
ఊహిస్తాను నేను!
అలాంటి తీయటి కలలనే పోషిస్తాను నేను !
ఆ మధురాతి మధుర క్షణాలకై
ఆజన్మాంతం నిరీక్షిస్తాను నేను!
వేదనావధూటినై !
రోదనానిర్ఝరీ హృదంతరాన్నై!!

ప్రౌఢురాలిని నేను!
ప్రణయినీ హృదయ దర్పణ బింబాన్ని నేను!
ప్రౌఢురాలిని నేను!
వికసిత మనోజ్ఞ మల్లికా కుసుమ వికాసాన్ని నేను!!
ప్రౌఢురాలిని నేను
వ్యక్తావ్యక్తానురాగ మాధురీ
భావసాగరాన్ని నేను!
తెగువ మిగిలిన
మగువ మనసును నేను!!!

# ఏమంటారు? మీరేమంటారు?

ఏమంటారు?
మహిళా సంవత్సరం ముగియబోతుందని
సంతోషంగా వీడ్కోలిస్తారా?
మహిళా దశాబ్దం అతి త్వరలో రాబోతుందని
దిగులుగా స్వాగతం చెప్తారా?
ఏమంటారు? మీరేమంటారు?

తరతరాలుగా సాగిన వనితా పీడనం
నరనరాలలో ఇంకిపోయిన పెత్తందారీ తనం -
ఒకే ఒక అబ్దంలో ముగుస్తాయా?
మఱొక దశాబ్దంలోనైనా తెగతెంపులౌతాయా? -
రాజ్యాంగం మాకిచ్చిందంటారు సమానత్వం!
స్వతంత్రం మాకందించిందంటారు వ్యక్తిత్వం!-
ఏ రంగంలో చూసినా తేడాతోనే చూస్తారు ఆడదాన్ని!
నేరం లేకున్నా, నేరస్థురాలినిగా నిందిస్తారు ఆడదాన్ని!
విద్యావకాశాలు హెచ్చించామన్నారు
ఉద్యోగావకాశాలు రెట్టింపైనాయన్నారు
ప్రాథమిక విద్యకే నోచుకోని కన్నెపిల్లలు కోకొల్లలు!
ఆధునిక జీవితానికే లంకెలేని వనితలు వేవేలు!

పుట్టగానే కన్నవారికే నిరసన - మెట్టగానే శ్రీవారికి చులకన!
కట్టె చేతికి రాగానే - కన్నబిడ్డలకే పలుచన!
ఇదండీ! ఆడదాని జీవిత కవితా సమాలోచన!
అదండీ! ఆడదాని జీవన వీణా నిక్వాణ పర్యాలోచన!
విద్యాధికులైనా - మార్పులేదీ నారీ జీవనయాత్రలో!
సంస్కారులైనా - తీర్పు మారదీ వనితా జీవితచరిత్రలో!
వేదికలెక్కి సమానత్వం ప్రసాదించామని
గొంతు చించుకుంటారు!
ఆది నుంచీ వస్తున్న అసమానత్వాన్ని మాత్రం
పెంచుతూ పోతుంటారు!
ఏమంటారు! మఱి మీరేమంటారు?

వధువుగా కళ్యాణ వేదికపై
సిగ్గుతో తలవంచమంటారు!
అదే మొదలు వనితకు తలవంపులు -
సహనంతో, అవమానం నిత్యం భరించమంటారు!
ఇంటికి ఇల్లాలే వెలుగని గొప్పగా వ్రాసేస్తారు
వంటిల్లు మాత్రం కదలకుండా బంధిస్తారు
పిల్లల్ని గన్న తల్లిని, మాతృమూర్తి అంటారు
పిల్లల బాధ్యతల్ని ఏ మాత్రం పట్టించుకోరు
విద్యావంతురాలు, ఉద్యోగస్తురాలు -
సహచారిణిగా కావాలంటారు
మధ్యస్థంగా, తటస్థంగా నిలిచి
గృహిణి భారమంతా నెత్తిన పులుముతారు
ఆఫీసులో నానా గడ్డి తింటూ, అడ్డమైన చాకిరీ చేస్తారు
సాఫీగా చెప్పినా, తాపీగా విన్నవించినా శ్రీమతికి ససేమిరా కాదంటారు
పై అధికారి ముందు - వంగి వంగి సలాములు చేస్తారు
ప్రేమాధికారిణి, గృహిణి ముందు మాత్రం దౌర్జన్యం చెలాయిస్తారు
చూపు తగ్గి, తల ముగ్గుబుట్టలా పండినా -

పదహారేళ్ళు పడుచుపిల్లే కావాలంటారు
ప్రాపులేక తలవాల్చినా - అనాథగానే పడుండమంటారు
ఏమంటారు? మరి మీరేమంటారు?

నినాదాలతో, సమావేశాలతో తేలదీ అన్యాయం!
మనో నిబ్బరంతో, ప్రమాదాన్నెదుర్కొంటే గాని
తీరదీ దురన్యాయం!
ఇలా శతాబ్దాలుగా చెలాయిస్తున్న
పురుషాధికారం పటాపంచలు కావాలి!
కృతజ్ఞతతో స్త్రీ జాతికి తలయొగ్గే
ప్రపంచం కావాలి
దృక్పథంలో మార్పు - ప్రకృతిలో మార్పు -
హృదంతరాలలో దృఢంగా ముద్ర వేసుకోవాలి!
ఆడదీ ఒక మనిషే నన్న నగ్నసత్యం -
తోడుగా నిలిచే 'సమ ఉజ్జీ' యన్న సద్భావం -
ఎదలోతుల్లో కలకాలం పాదు చేసుకోవాలి!
వనిత బానిస కాదు - లలన విలాస వస్తువంత/కన్నా కాదు!
నారి - షోకేసులో ఉంచే 'సారీ' అంతకన్నా కాదు!
స్త్రీ - దానవ శక్తుల కడ్డు నిలిచే శక్తి స్వరూపిణి!
స్త్రీ - మానవ హృదంతరాలలో నిలిచే పూజ్యరూపిణి!
స్త్రీ - పావన మాతృ సుధామృత మందిచ్చే అమరమూర్తి!
స్త్రీ - సమానంగా పురుషునితో - ప్రేమను గౌరవాన్ని, పంచుకొనే ఆదర్శమూర్తి!
ఈ భావన, ఈ సహృదయం, ఈ కృపాంతరంగం -
పురుష లోకంలో ఏనాటికైనా వస్తుందా?
ఈ మార్పు, ఈ ఓర్పు, ఈ కలగలుపు -
ఎన్నటికైనా, ఈ భారతదేశంలోనైనా మొదలై -
స్త్రీ జాతికి గుర్తింపు, పురుష జాతికి మేల్కొలుపు కలుగుతుందా?!
ఏమంటారు? మీరేమంటారు?

# లిమిటేషన్

ఎవల్యూషన్‌కు లిమిటేషన్ లేదు -
మానవాభ్యుదయ వాహినీ సంచలనం తప్ప!

రివల్యూషన్‌కు లిమిటేషనే లేదు -
భావనా జలపాత విద్యుత్ప్రవాహం తప్ప!

పొల్యూషన్‌కు లిమిటేషనే లేదు -
నిర్మల నైసర్గిక మలయ మారుతం తప్ప!

సొల్యూషన్స్‌కు లిమిటేషనే లేదు -
విశ్వమానవ కల్యాణోత్సవం తప్ప!

కన్ఫ్యూషన్‌కు లిమిటేషనే లేదు -
పాలనా యంత్రాంగ పరివర్తనం తప్ప!

ఇన్‌ఫ్లేషన్‌కు లిమిటేషనే లేదు
'ధనమూల మిదం జగత్' అన్న సూక్తి తప్ప!

డెమోక్రసీకి లిమిటేషనే లేదు -
సద సద్వివేక చింతనా పరమార్థం తప్ప!

బ్యూరాక్రసీకి లిమిటేషనే లేదు
నిరక్షరాస్య దీనజన సంక్షేమం తప్ప!

ప్లానింగ్‌కు లిమిటేషనే లేదు
సహజ సంపద - సర్వతో ముఖాభివృద్ధి చెందడం తప్ప!

కమిట్‌మెంట్‌కు లిమిటేషనే లేదు -
సమతా భావ సంపూర్ణ మానత్వం తప్ప!

స్లోగన్స్‌కు లిమిటేషనే లేదు -
వాగన్స్‌లా కోర్కెలు పెల్లుబకడం తప్ప!

ఇమిటేషన్‌కు లిమిటేషనే లేదు -
విద్యుత్ప్రతిభా రససమన్వయం తప్ప!!

# ఆశల చివళ్ళు

ఆశకు సంకెళ్ళు లేవు!
ఆశా కుసుమ వికాసానికి చివళ్ళు లేవు!

ఆశకు పరిధి లేదు!
ఆశావార్నిధికి చెలియలి కట్టలేదు!

ఆశకు అవధి లేదు!
ఆశా విశిఖానల జ్వాలకెదురే లేదు!
ఆది మానవ కాలం నుంచి మేధస్సును తొలిచిన
తొలుస్తూన్న వింత సూక్ష్మక్రిమి-
ఈ ఆశాజీవి!! -
ఆ తొలి దినాలలో, ఆ ఆతి యుగంలో
చతుష్పాదాలతో, చతుష్పథాలలో
ఎదురొడ్డి - "సర్వైవల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్"-
అన్న ఆర్యోక్తిని
మేధాబలంతో భుజబలాన్ని మేళవించి
నిరూపించిన నాటి మానవజాతికి -
ఆశాకిరణమొక ఉషోరోచిస్సు !-
హరప్పా, మొహంజొదారాలలో

పురావస్తు శిల్పాలలో - పుడమి కడుపున దాగి
కడు ప్రయాసతో వెలిదీసిన శిలా శాసనాలలో
లీలగా, వ్యక్తావ్యక్తంగా, తలలు పండిన శాస్త్రజ్ఞులకు,
కొమ్ములు తిరిగిన చారిత్రక పరిశోధకులకు,
సరిగా అర్థంకాని లిపి హృదంతరాలలో
తొంగి తొంగి చూచింది - తొలి మానవుని
ఆశావిహంగ కలకల నాదాల పునాది !!
సతీ వియోగానలదగ్ధుడై, విప్రయోగ బద్ధుడై
భౌతిక ప్రపంచమే శూన్యంగా,
మొగల్ సామ్రాజ్యమే అనిత్యంగా,
ద్రాక్షాసవాలమత్తులో, హుక్కాపీల్పుల ఉన్మత్తతలో
రాగానికీ, విరాగానికీ, అతీతమైన సంధి కాలంలో
కొట్టుమిట్టాడుతున్న షాజహాన్ జహానా,
మనో నేత్రాంచలాల్లో, తటిల్లతలా మెరిసిన,
ఆశాకిరణద్యుతి - ఉజ్జ్వల ప్రేమజ్యోతి -
జాజ్జ్వల్య చంద్రశిలా రూపస్మృతి,
భువన మోహన సమాధిగత నిర్వృతి -
తాజ్‌మహల్ నిజస్థితి!-
రమణీయమైన చలువరాతి శిల్పాంతరంగంలో
యమునా తరంగ శిశిర శీతల శీకర సేచనంలో
పూర్ణశరత్ జ్యోత్స్నా సమాలింగిత ధవళాంతరంగంలో -
అమరప్రేమ నిత్యంగా, అమలిన ప్రణయం సత్యంగా,
తరతరాలుగా, మహోన్నత ప్రణయచిహ్నంగా
నిలిచిపోయిన -
ఒక విరహవేదనా భారవిభావరి!
తొలగిపోయిన
ఆశాశశాంక జ్యోత్స్నాలహరి!!

తాజ్‌మహల్ నిత్యశోభాలహరి!!! -
తరతరాలుగా, ఊషరక్షేత్రాలుగా,
కనుచూపుమేర పచ్చికైనా మిగులని బీళ్ళుగా,
వాన చినుకులకు, ఏటికాల్వలకు, నోచుకోని బంజరు భూములుగా,
నిలిచిన పలనాటిసీమ - వెలసిన నల్గొండ సీమ -
పండిన ఆశల కలల విన్నాణమై,
నిండిన ఊహాతరంగ విన్యాసమై,
విశాలాంధ్ర జననీ కృపాపాంగ రోచిస్సుగా
కృష్ణవేణీ చలదూర్మికా నవజీవనాంభస్సుగా,
అశేష భారతావనీ సస్యభాండాగార
స్వప్నవర్చస్సుగా వెలసింది!
వినీల కృష్ణవేణీ తరంగ మధుర సంయోగం!
మానవకృత విశాల వినీల తరంగసాగరం!
పతిత మానవానంద సాగరం!
జ్వలిత భావనా జలధీతరంగం!
సముజ్జ్వల మృత్తికాసేతు సంభారం!
మహోజ్జ్వల ఆశాజ్యోతి - నాగార్జునసాగరం!! -
నెలల తరబడీ, సెలవేసి,
గుండెల్లో కుంపటిలా, ఊపిరితిత్తుల్లో కొలిముల్లా
అక్షయమైన దగ్గుతెరల్తో, - భక్షిస్తూన్న క్షయ!-
రాత్రంతా కునుకు రానీక, ఎదల్ని నలిపి,
రక్తమాంసాల్ని శ్లేష్మరూపంగా, రక్తాశ్రువులుగా
వెళ్ళగక్కించిన - రాక్షసి క్షయ!-
ఓ సుప్రభాతాన క్షణకాలం కనుమరుగైనప్పుడు
గుండె అదుటు తగ్గి, మండే ఊపిరుల పొగలుడిగి,
ఆయాస ముపశమించి, ప్రయాసలు మందగించి,
చేరువైనారాని, చెంతకేజేరని -

నిద్రాదేవి - మృదుమధుర దరహాసంతో
స్వప్నలోక సుఖాల నందిస్తానని
ప్రాణప్రియాలింగన మొనర్చినపుడు -
అలవోకగా, నెచ్చెలి లీలగా
తొంగితొంగి చూచింది
ఆశారోచి ఉషో హృదయంలా
ఆ క్షయరోగి కనుగొలకుల్లో,
ఆ క్షతగాత్రుని మనసు తుదల్లో !!-
విషజ్వరంతో, భిషగ్వరుల కంతుపట్టక
జనరల్ ఆస్పత్రిలో, జనరల్ వార్డులో
చాలని మంచాలై నేలపైన పడి
జ్వరతీవ్రతతో, పలవరిస్తూ, కలవరిస్తూ -
ఏదో అగాధాలకు, ఏదో పాతాళాలకు
వ్యాధిగ్రస్త శరీరంతో, వ్యధిత హృదయంతో -
పరువులు తీసి, జర్రున జారి,
గిరగిరా పల్టీలు కొట్టినప్పుడు,
కళ్ళు చింతనిప్పుల్లా, భగభగమని మండుతున్నప్పుడు
ఒళ్ళు సలసలమని, నిప్పుల పెనంలా కాలిపోతున్నప్పుడు
సంధి ప్రేలాపనలు, సంధిగ్ధాలాపనలై
తన ఉనికి, తనకే నిజంగా తోచనప్పుడు,
ఊహాతీతమైన వేదనా డోలల్లో,
మనసు ఉయ్యాలలూగి, కాలుజారి, పట్టువదలి
దభీలుమని నేలబడ్డప్పుడు,
రక్తంలో తెల్ల కణాలు సమసి,
అశక్తత నరనరాలు మెలసి,
అంతు తెలియని చీకట్లలో, అంతిమయాత్రికునిలా -
విషాద జీవన సాగరంలో - తెరచాపలేని నావికునిలా,

ఒంటిగా మృత్యుముఖంగా పయనిస్తున్నప్పుడు -
'మిస్టర్' అన్న సిస్టర్ మెత్తటి పిలుపు విని,
కష్టాలకొక గడువుందని, నష్టభాగ్యుడైన -
తనకింకా నూకలున్నాయని,
మనసింకా ప్రీతి ముక్కలు కాలేదని
మృత్యువేదనతో,
పరిభ్రమించే ఊహావిహంగం -
చిఱునవ్వు వెన్నెలలు చిందించే
'సిస్టర్' మృదునయనాపాంగం -
గూడనుకొని, తన బ్రతుకున కొక నీడనుకొని -
పాశవిదూరయై పరుగిడబోయింది!
ఆశల తీరాల అందంగా విహరింపబోయింది!-
కిళ్ళీకొట్టుతో మొదలై
పళ్ళాలనిండా రూకలై
చిన్నచిన్న కిరాణాకొట్లు - మిన్నంటే ఫ్యాన్సీ దుకాణాలై,
బీచ్‌లో మరమరాలు - రీచ్ కందని సిరివరాలై,
నల్లబజారులో వెల్లివేసిన తెల్లనోట్లు -
ఎన్నికల పెన్నిధులై -
నిన్నటిదాకా అడ్డకట్టు, నేడు చెన్నుమించి
పొందూరు గూడ కట్టి
నిత్యావసర వస్తువులను పత్యానికయినా లేక
మాపుజేసి -
బ్లాక్‌లో బేరాన లాభియగ్గై
ఆకాశాన్నంటే ధరలు, సాకారధనాశాసాగరాలై -
క్షుధార్తితో నకనకలాడే
వ్యథిత హృదయాలు -
పాల డబ్బాలకు, పంచదారకై అలమటించే

మాతృ హృదయాలు -
కిరసనాయిల్‌కు, సరసమైన ధరలకు, పరితపించే
సామాన్య మానవ దీనహృదయాలు -
వ్యర్థాడంబరాలకు, స్పర్థాహంకారాలకు, నీతి నియమాలకు పాతుకొనిపోయి
డాబులుడిగి, ఊబిలో దిగబడ్డ
మధ్యతరగతి
త్రిశంకుస్వర్గ భావోదయాలు -
స్వార్థపరులకు -
అన్యాయ ధనార్జనా పరులకు -
అపర చాణక్య రాజనీతిజ్ఞులకు -
తిమిర వ్యాపార ప్రజా ధురీణులకు -
అసమాన సాంఘిక వ్యవస్థా ప్రతిష్ఠాపకులకు -
మానవతా భావశూన్యులకు -
ఆశాగగన ధ్రువతారలై,
దురాశావార్నిధీ జలాంతర
బడబాగ్నిచ్ఛటారోచిస్సులై
అత్యాశాగహనాంతర
దావానలజ్వాలలై
బలిసాయి
దురాశల మొదళ్ళు!
వెలిసాయి
ఆశల చివళ్ళు!! -

# చర్విత చర్వణం

సర్వే చేస్తున్నాను
చర్విత చర్వణంగా
ఉర్వీతలాన్ని
ఊహా రోదసీ నౌకలో !-
అంతా ప్రశాంత వాతావరణం!
అంతా ఊహాతీత ఖగోళ ప్రయాణం!
గోరంతలు కొండంతలుగా చేసే ఈ లోకం -
సారూప్యమే లేని బిందువై అణగారిపోయింది
ఈ అనంతాకాశంలో!
అమరలోకంలా వెలిగే ఈ విద్యుదాడంబరం -
ఆముదం వత్తిలా మిణుకు మిణుకు మన్నది
ఆ వినీలాంబరంలా!
కలుషిత వాతావరణంలో నలుపు తిరిగిన
ఈ భూగోళం -
విలసిత ప్రతిబింబ కాంతి సుధాకేంద్రమైంది
ఆ విశాలవిశ్వంలో !
సంచలనం రేపే నినాదాలతో హోరెత్తిన

ఈ చంచల ప్రపంచం -
నిశ్చల నిర్వాణస్థితి ప్రబోధస్థావరమైంది
ఆ కాలాతీత భువనంలో !
తరతరాల అంతరాలతో అట్టుడికిపోయిన
ఈ మానవలోకం
తరతమ భేదమే లేని నిర్గుణ స్థితినందింది -
ఆ తారా కాంతి పథజగత్తులో !
శూన్య మేథస్సుతో సర్వజ్ఞతను వెలగబెట్టే
ఆ అజ్ఞాన భూవలయం -
శూన్యాతీత సర్వాంతర్యామిత్వాన్ని చాటిచెప్పింది
ఆ నవగ్రహ సంచార వియత్పథంలో ! -
అంతా నిశ్శబ్దం!
అంతా జ్ఞానసమాధిమగ్నం!!
అంతా కాంతి సముద్రం!!! -
సర్వే చేస్తున్నాను
చరిత్ర చర్వణంగా
మానవజీవితాన్ని
భావనావ్యోమయాత్రలో!! -

# మనసొక రబ్బరుబంతి !

మనసొక రబ్బరుబంతి!
అనుక్షణం సంచలించే చైతన్య స్రవంతి !! -
జీవితం ఒక ఫుట్‌బాల్ గేమ్!
అంతరాత్మ - రెఫిరీ!
పంతాలు పోయే భేదమోదాలు ప్రతిస్పర్థులు !
టాస్‌లో ఆనందానికే పాస్ దొరికింది!
విజిల్ వేసాడు రెఫిరీ - ఆటమొదలెట్టమని !
తన్నాడు తొలిషాట్‌ని అమితానందంతో
సంతోషాల టీమ్ కెప్టెన్ - పరమానందం!
అంతే -
మనసెగిరి గంతులేసింది - గగనంలోకి దూసుకుపోయింది
బంతి - చుక్కల్తో ఆడుకుంది
కోరికలు - మిన్నుల్లో పల్లటీలు కొట్టాయి
పరమానందం అనుచరులు ఎగిరి గంతేసారు
తొలి గోల్ అయిందని - తమ ధ్యేయం ఫలించిందని !!
ఇంటర్వెల్‌లో -విషాదం టీం - ఖుషీగా లేరు
రుసరుసలాడారు - బొమలు చిట్లించారు
మీసాలు మెలేసారు - రోసాలు పెంచేసారు

'హుం!' అన్నారు - 'ధాం ధూం' అని ఎగిరారు
డ్రింక్స్ తెచ్చిన బేరర్స్పై !
మళ్ళీ మొదలైంది బంతి ఆట ! -
కిళ్ళీ నములుతూ విజిల్ ఊదింది- అంతరాత్మ!
ఈసారి ఆనందం టీమ్‌ని గల్లంతు చేసి
మోసానికి మోసంగా
లాంగ్‌షాట్ కోసాడు -
దిగుళ్ళ కెప్టెన్ - నిత్య విషాదం!
అంతే -
మనస్సు అధోలోకంలోకి దూసుకుపోతుంది
బంతి వివత్కర పరిస్థితుల పదఘట్టనలలో
వంతలపాలయింది!
నేలమీదనే అటూ ఇటూ పరుగులు తీసింది
కాలితన్నులే శోకనాదంగా మారింది
ఆనందాల గోల్‌కీపర్
నానా తంటాలు పడ్డాడు బంతినాపుదామని!
కనీసం నాలుగయిదుసార్లన్నా బోర్లగా పడ్డాడు
గోల్ కాకుండా అడ్డుదామని -
నెత్తినా ముఖానా దుమ్ము గొట్టుకొని,
నెత్తురు గాయాలకు తట్టుకొని -
కానీ - ఏం లాభం?
విషాదం పెనాల్టీ గోల్
నిషాలో తన్నాడు!
ఖుషీగా గోల్ అయిందని!
ఎగిరి గంతేసి - అనుచరుల భుజాలపై కెక్కి -
అరిచాడు జయం నాదని!
విషాదం గెలిచింది - మషీరసం పులిమింది!-

ఆనంద వదనాన -
విజిల్ ఊదడం మానేసింది - అంతరాత్మ -
అనిశ్చితంగా ఆట ఆగిపోయింది మధ్యలో !-
ఈ ఖేదమోదాలు,
ఈ సుఖదుఃఖాలు,
ఈ రాగవైరాగ్యాలు
ఈ శోకానందాలు -
మానవజీవన ఖేలలో
అనుక్షణం పోటీలు పడుతున్నాయి !
మనసేమో ఈ రెండింటి మధ్యా నలిగిపోతుంది!
సంతోషం పైకెత్తితే - ఎగిరి, నింగి నందుకొంటుంది!
విషాదం విసిరేస్తే - విసిగి, నేలకంటుకొని పోతుంది!
రాగం గిలిగింతలు పెడితే
ప్రణయ మహాసామ్రాజ్యాల నేలుతుంది!
వైరాగ్యం తల్లక్రిందులు చేస్తే
ముక్తి లోకాలను వెతుక్కుంటూ వెళ్తుంది!
శోకం పెల్లుబికితే,
అథోలోకాలను - సందర్శిస్తుంది!
ఆనందం అర్ణవమైతే
ఇంద్రపదవినే కాంక్షిస్తుంది!
ఉయ్యాలలా ఊగిసలాడుతుంది సందేహాలతో !
సయ్యాటలలో ఊపిరి బిగబడుతుంది సందిగ్ధంతో !
ఆటగాళ్ళ దుందుడుకుతనాన్ని -
ప్రేక్షకుల రౌడీతనాన్ని -
అంతరాత్మ మందలించదు !
పంతాలను వదిలించదు!
ఆనంద, విషాదాల మధ్య

అటూ ఇటూ ఊగే - పెండ్యులంలా -
రోష, కారుణ్యాల మధ్య
అటూ ఇటూ మసలే గుండెలా -
సల్లాప విలాపాల మధ్య
అటూ ఇటూ మెదిలే హృదయంలా -
కంపించిపోతుంది మనసు ! కలగుండు పడిపోతుంది మనసు !
నిరంతర పరిభ్రమణం !
నిరంతర సంక్షోభం!
నిరంతర సంచలనం !
నిరంతర మథనం!
ఇవే మనోకందుక ప్రవృత్తులు !
ఇవే మనో సహజవ్యావృతులు !
శంకర భగవత్పాదుల వేదాంత దృక్పథంలో
మనసొక కోతి !
శంకావృతమై., సంకులమైన, భయంకరమైన
ఆధునిక జీవిత క్రీడారంగంలో
మనసొక బంతి!
ఊహా పరిభ్రమణం - మనో కందుకలక్షణం!
శాఖాచంక్రమణం - మనోబుద్ధ్యహంకార వైలక్షణ్యం
ఏ వియత్పథంలో విహరించినా -
ఏ అథోలోకాలలో సుడుగుళ్ళు పోయినా -
ఏ పృథివీ తలంలో నిలువక పరుగులు తీసినా -
చివరకు ఏ దృక్పథంలో పరికించినా -
మనసొక చిత్రమైన
రబ్బరు బంతి!
అది అనుక్షణం సంచలించే, సంక్షుభితమయ్యే -
చైతన్య స్రవంతి !! -

# చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి!

చూసావా?
నిశితంగా మొగంలో మొగముంచి!
చూసావా?
నిశితంగా కనులలో కనులుంచి! –
కోటేరేసిన ముక్కు,
దీటులేని చక్రాల్లాంటి కళ్ళు,
దానిమ్మ గింజల్లాంటి పళ్ళు,
దొండపండులాంటి అధరాలు,
చిదిమితే పాల్గారే చెక్కిళ్ళు,
సొట్టబడినా అందంగా ఉండే చుబుకం,
బూరెల్లాంటి బుగ్గల మిసిమి అందం,
"వారెవా!" అనే యౌవన మకరందం –
అన్నీ కనిపిస్తున్నాయి స్థూలంగా !
అన్నీ అవగతమౌతున్నాయి స్థాలీపులాకన్యాయంగా ! –
అగాధాలైన నీలికనుపాపల వెనుక,
నయనాంతర రక్తధమనుల్లో –

ప్రతిఫలించే నీ ప్రతిరూపాన్ని,
ప్రతిబింబించే నీ మనోగత భావాన్ని -
చూసావా?
నిశితంగా కనులలో కనులుంచి ! -
కనురెప్పపాటులో
కనుపాప నీలితెరలలో
కదలాడే, మెదలాడే దూరదర్శినిలో
ఊహాతరంగ వర్ణచిత్ర ప్రదర్శనం,
భావఝరీ ప్రవాహ వేగ నిదర్శనం -
చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి
చూసావా? నిశితంగా కనులలో కనులుంచి!!
సునిశిత నాసికాశిఖరాగ్రాలలో -
కావ్య పరిమళ మనోజ్ఞ తోయదాలు వర్షిస్తున్నాయా?
వికసిత నయనగోళ గుహాంతరాలలో -
శారద చంద్రజ్యోత్స్నా మధురిమలు ప్రకాశిస్తున్నాయా?
సువిశాల ఫాలాంతర పులినతటంలో -
ప్రతిభాసైకత, సితాసిత కాంతులు ప్రతిఫలిస్తున్నాయా?
కించిద్వికసిత వదన మనోజ్ఞ సానువుల్లో -
హరిత రమణీయ పాండితీ దరహాసనుధలు విజృంభిస్తున్నాయా!
చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి !
చూసావా? నిశితంగా కనులలో కనులుంచి!
అందం చూచి, చందం తలచి, అంతస్తు తూచి
బేరీజు వేయకు మనిషి ముఖ కవళికల్ని !
ఎత్తుపల్లాలుగా, ఎగుడు దిగుడుగా, జీవితంలా
ముక్కూ, మొగమూ - ఉంటాయి మనిషన్నవాడికి!
దూరానికి - నున్నగా, గుండ్రంగా, జాబిల్లిలా కన్పించే ముఖం -
దగ్గరలో, దుర్భిణీ వీక్షణలో - స్వేదబిందు సముదాయం!

ఇంకా సన్నిహితంలో - రోమకూప సమూహం ! -
అయినా -
బాహ్య సౌందర్యానికే - ప్రాధాన్యమిస్తావు నీవు !
పైకి మెఱమెఱలాడే
మేని తళతళలకే చేయూతనిస్తావు నీవు!
అంతరంగం కనుమఱుగయ్యేలా
మెస్మరిజం చేసే బాహ్యముఖ విన్యాసాలకే
ఓటేస్తావు నీవు !- -
చిట్లించే - ఆ నొసటి బొమముడి వినువీథుల్లో
పెట్లిపోయిన వేదనా వినీలజలద విహారం - నీకేం తెలుసు?
సంచలించే - ఆ నయనాశ్రుతటాక మధ్యంలో
వంచనాసమ్మిళిత దుఃఖవాహినీ తరంగ సంచలనం - నీకేం తెలుసు?
కదలిపోయే - ఆ అరుణాధర నిర్ఝరీ ప్రవాహాంతరంలో
కదిలించే విషాద రమణీయ భావనా జలపాతం హోరు - నీకేం తెలుసు?
నీకు కనిపించిందల్లా -
చీకూ చింతాలేని సుందర దరహాసం !
నీకు వినిపించిందల్లా -
సౌఖ్యమే పరమావధియైన బృందగానం !
కానీ -
అజ్ఞాతమైన ఆ వికృత వదనంలో -
విజ్ఞానం వెల్లివిరుస్తుందని నీవనుకోవు!
అవ్యక్తమైన ఆ వినీలగళంలో -
దివ్యమైన గానామృతం వెల్లువలౌతుందని నీవూహించవు !
సహ్యంగాని ఆ నయన ద్వయంలో-
బాహ్యవీక్షణాతీతమైన కరుణారసం చిప్పిలుతుందనుకోవు!
కొనదేరని ఆ నాసికాగ్రంలో-
వాసనాతీత సౌరభావేశం విరజిమ్ముతుందని నీవెఱుగలేవు!

వసివాడిన ఆ మొద్దు పెదవుల్లో-
రసబంధుర కవితానిర్ఝరులు పొంగిపొరలుతాయని నీకెఱుకలేదు!
కేవలత్వగింద్రియ సౌందర్యారాధనా మదాంధుడవు నీవు!
కేవల చర్మదమ్ను సౌఖ్యరస డోలాంతః కరణుడవు నీవు!
అంతరంగం నీకక్కఱ లేదు!
ఆంతర్యం నీకసలు పనిలేదు!
అంతరార్థం నీకెఱుకపడదు!
ధ్వని పరమార్థం నీకెటూ కొఱుకుడు పడదు!-
పైపై మెఱుగుల పొలపొంగులో పడి
పొంగిపోతావు!
పైపై డాబుల షరాబీకైపులో
మునిగి తేలిపోతావు!
శంఖంలో పోస్తేనేగాని తీర్థమనుకోవు!
పేరొచ్చిన వాళ్ళకే వంగి వంగి
సలాములు కొడతావు
నోరున్న వాళ్ళనే కనిపెట్టుకొని, పనిగట్టుకొని
కాకాలు పడతావు
అందుకే-
సహజమనోజ్ఞ సౌమ్యాకృతి వెనక పొంచి చూసే
అహం నీకు కనిపించదు!
సుమధుర స్వరలహరులైన వాక్కులలో తొంగిచూసే
కర్కశత్వం నీకు వినిపించదు!
వెన్నెలలు జాలువాఱే చూపుజల్లుల మాటున వర్షించే
తీక్ష తమాల పల్లవత్వం నీకు స్ఫురింపదు!
సురభిళ కుసుమాఘ్రాణం చేసే నాసికాగ్రాన తొణికిసలాడే
గడ్డిపూల తెలితావులు నీ కవగతం కావు!
మెరిసిందంతా బంగారమనీ,

కురిసిందంతా కుంభవృష్టి అనీ,
విరిసే కృష్ణపక్ష నిశీథినులను -
పరుచుకున్న పండు వెన్నెల రేలనీ-
నిన్ను నీవే మోసం చేసుకోకు!
మిన్నుకూ - మన్నుకూ - అసలు వ్యత్యాసం - తెలుసా నీకు?
చూసావా? నిశితంగా మొగంలో మొగముంచి!
చూసావా? నిశితంగా కనులలో కనులుంచి!
బరువైన ఆ తెలిఱెప్పల మాటున
నిరవధికమైన దయా సముద్రాన్ని-
గద్గదమైన ఆ వినీల గళాంతరంలో,
దైన్య రమణీయ సంగీత లహరిని-
వగపేచి, సంచలించే, ఆ మధురాధరాలలో
విషాదమధుర కవితా పీయూషాన్ని -
ఇంద్రియ సహజ, క్షణిక సౌందర్యాంతర్గతంలో
త్వగింద్రియాతీతమై,
అలౌకిక సౌందర్యకల్పనా భవిష్యత్తును-
సామాన్యుని జీవన పరిధిలో
అసామాన్య వియద్విహంగ పురోగమనాన్ని -
సనాతనాంతర్గత సంస్కృతీ భాండంలో
అధునాతన భావవిప్లవ బీజామృతాన్ని —
ఆకార రేఖాపరిధుల్లో
నిరాకార భావనా నిరవధికతను -
విహ్యమైన బాహ్య సౌందర్యంలో
అనూహ్యమైన అంతః సౌందర్యాన్ని -
అవ్యక్త కంఠవేదనా రవంలో
సువ్యక్త మధుర విపంచీ మోదనినాదాన్ని-
అనామక వదన భావ ప్రకటనలో

మహాత్ముని వివేక భానుకిరణ దరహాసాన్ని-
ద్వైతభావ చిహ్ననయన ద్వయంలో-
అద్వైత జ్ఞాన తేజః పుంజాన్ని-
భిన్నత్వంలో - ఏకత్వాన్ని -
మన్నులో - మిన్నును తలదన్నే ధీమాని -
చూసావా?
నిశితంగా
మొగంలో మొగముంచి?!
చూసావా?
నిశితంగా
కనులలో కనులుంచి??

# అజ్ఞాతగళం

ప్రజ్ఞా ధురీణమైన
ఓ అజ్ఞాతగళమా!
ఎందుకు నీకీ జిజ్ఞాస?
సాహిత్యాన్ని చవకబారుగా
సంతలో వేలం వేస్తున్నారని - సంతాపమా?
కవిత్వాన్ని కలప సామానులా
టోకునకు విక్రయిస్తున్నారని-విషాదమా?
రాజకీయాలు మూకుమ్మడిగా
తలదూర్చని జీవనరంగం లేనేలేదని - విచారమా?
సహజగుణాన్ని, నైసర్గిక సౌందర్యాన్ని
చహరా లేకుండా పహరావాళ్ళే
భూస్థాపితం చేస్తున్నారని,
కలుషిత పరుస్తున్నారని-ఆక్రందనా? ఆవేదనా?
వంచనకు తలొగ్గిన పంచపాండవులకే -
అరణ్యవాసం, ఆపైన అజ్ఞాతవాసం తప్పలేదని-
తరుశాఖల తలక్రిందులా తపస్సు చేసే
వాలఖిల్యులకే, పక్షీంద్రుల నఖక్షతదుర్గతి తప్పలేదని,
అట్టడుగున పడిపోతున్న ప్రతిభావ్యుత్పత్తులకే

మతిలేని వాళ్ళు కొలబద్దలుగా పరిగణన లభించిందని,
జాతి జీవనంలో దిగజారిపోతున్న నీతీ, నిజాయితీలకే-
ఏతావాతా పరాజయ పట్టం లభిస్తుందని- .
సాహిత్యరంగంలో వర్ణమాహాత్మ్యం
తెల్లపూవులా వికసిస్తుందని-
కవితా వ్యవసాయంలో వర్గ ప్రాధాన్యం-
కలుపుమొక్కలా దుబ్బుగా పెరిగిందని,
సహజ పాండితి కేనాడైనా బహుమతి లభిస్తుందన్న
వాదంలో - పరాజయం పొందావని-
ప్రతిభ కేనాటికైనా గుర్తింపు వస్తుందన్న
నిరీక్షణలో - నిస్పృహ జెందావని -
ప్రజ్ఞా ధురీణమైన - ఓ - అజ్ఞాతగళమా!
ఎందుకు నీకీ జిజ్ఞాస? -
జమ్మి చెట్టుపై శవాకారంలో
నిక్షిప్తమైన గాండీవం -
అజ్ఞాతవాస విముక్తుడైన ధనంజయుని
సవ్యసాచిత్వంలో - సమ్మోహనాస్త్రం ప్రసారం చేసింది!
దుష్ట చతుష్టయం ఆటకట్టించింది!
శిష్ట రక్షణం, ధర్మ విజయం - విజయ శంఖారావంలా-
ప్రతిధ్వనించింది - ఆ ఉత్తరగోగ్రహణ సమరంలో!
రసవ్యంగ్య, ధ్వని మాధురీ, శోభా సమ్మిళితమైన,
ప్రతిభా వ్యుత్పత్తుల సమన్వయమైన అజ్ఞాతగళం!
ఏనాటికైనా, గాండీవ ధనుష్టంకారంలా
సహజనిర్మల, సహృదయ సమ్మిళితమైన
మానవతావాద, సామ్యవాద సమన్వయమైన,
యువకావేశ మనోకోకిలాజ్ఞాతగళం-
ఏనాటికైనా-

ఆకలిగొన్న కొదమసింగపు రౌద్రగర్జనలా-
రసికజన సహృదయాలలో
కవితాసమ్మోహనాస్త్రమౌతుంది!
మనకకన్నులు జాతి జీవనప్రగతిలో
నవ వైతాళిక సమతాగీతా ప్రవచనమౌతుంది!
పరిస్థితులు విషమించి -
గరిష్ట సామాన్య గుణకం - నిస్తేజమైనప్పుడు
అరాచకం, అన్యాయం, అక్రమం - విజృంభించి,
కనిష్ట సామాన్య సౌజన్యం - నిర్వీర్యమైనప్పుడు
అంతర్లీనమైన ప్రతిభా కవిత్వబీజం -
చైతన్యవంతమైన జీవశక్తితో
భావనా గండశిలా కఠిన హృదయాన్ని ఛేదించి
మండే నిప్పురవ్వలా - కదలాడుతుండే ఎఱ్ఱని మఱ్ఱిచివురులా
స్వేచ్ఛావాయువుల బీల్చి
తెల్లబావుటాలా వెలుస్తుంది!
సాహితీ సహృదయ రంగంలో,
శీతలచ్ఛాయా ప్రశాంతతలు వెల్లివిరిసే -
మహావటవృక్షమై!
రసికభావనా సుక్షేత్రంలో,
మహాకావ్య రసవృష్టి కురిసే-
మఱ్ఱి ఊడలై - నిలువనీడలై
కలకాలం నిలిచిపోతుంది!
ఈ నగ్నసత్యాన్ని - ఎవరూ కాదనలేరు
ఈ భగ్న హృదయవిప్లవాన్ని - ఎవరూ త్రోసిరాజనలేరు!
ప్రజ్ఞాధురీణమైన
ఓ అజ్ఞాతగళమా!
ఎందుకు నీకీ
జిజ్ఞాస??-

# మళ్ళీ తలెత్తాను నేను!

అహంకారం - పణంగా,
అజ్ఞానాంధకారాలు - కోఱలుగా,
అసూయా మత్సరలోభాలు - తోకలుగా,
మూర్తీభవించిన క్రౌర్యం, దౌర్జన్యం, అసహనం - సర్పాకృతిగా
తలెత్తి, బుసకొట్టి, పడగవిప్పి - ·
సగర్వంగా విజృంభించాను నేను-కాటేస్తామని ఈ లోకాన్ని!
ఇలాతలం సర్వం - భయభ్రాంతమై
నా పడగల నీడల్లో పడుంటుందని
భ్రమించాను నేను!!
కానీ-
నడినెత్తిన బొప్పికట్టేలా - మడిగట్టిన మాంత్రికుడు
త్రిప్పికొట్టాడు నన్ను - మంత్రదండంతో!
అంతవరకూ వినిపించిన - వంతపాటల బూరగ -
చటుక్కున ఆగిపోయింది!
అంతవరకూ కనిపించిన - తంత్రలోక వైభవం-
ఠపీమని మటుమాయమైంది!
కసికసిగా, విషపు బుసలు కొట్టాను నేను!
పసలేదని - తన్నితరిమేసారు నన్ను!

కస్సుమని లేచి - పడగవిప్పాను నేను!
తుస్సుమనే రబ్బరు పాముని వదిలేసారు నన్ను!
ఆక్రోశం, అంధకారం - ఆవరించాయి నన్ను!
అవమానం, మందగమనం - చుట్టుముట్టాయి నన్ను!
అందరిలా తోకముడిచి - పారిపోలేను నేను!
కొందరిలా గత వైభవాల్ని, స్మృతుల్ని - నెమరేస్తూ కూర్చోలేను నేను!
అజ్ఞాతంగా వల్మీకంలో తలదాచుకొనేందుకు
అహం, అభిజాత్యం, అభిమానం - దృష్టిదోషంలా
అడ్డొచ్చాయి నాకు! గడ్డు సమస్యలైనాయి నాకు!!
ప్రజ్ఞాధురంధరత్వంతో,
అవజ్ఞాగ్ని శిఖా సంరంభంతో,
మళ్ళీ మళ్ళీ విజృంభించడానికి -
అపఖ్యాతి, అసహనం, అనుమానం -
మసకపొరల్లా, విసర్జించలేనికుబుసంలా -
అవరోధమైనాయి నాకు!
గోధుమ వన్నె మేలికోడెనాగును నేను!
బాధలను, అవమానాల్ని క్షణమైనా
మఱచిపోలేని జాతిత్రాచును నేను!
అదను కాదని - ప్రస్తుతం అణగి ఉన్నాను నేను!
పదను కాలేదని - విసపు కోరల్ని పెంచటం లేదు నేను!
ఎదలోనే పదిలంగా నింపాను - కాలకూట విషాల్ని నేను!
వగపుల పొగలతో, సెగలతో భద్రంగా దాచాను-
తీరని పగల్ని నేను!
నా పైపై కోఱలే పీకేసారు ఈ పిచ్చి ప్రజలు!
ఆపైన ప్రేళ్ళూనిన విసపు మొదళ్ళు-
త్రుంచలేరు ఈ వెఱ్ఱిబాగులవాళ్ళు!
అన్యాయం, అసమానత్వం, అరాచకత్వం -

నా విషాగ్నిజ్వాలల మూలసూత్రాలు!
దౌర్జన్యం, బానిసత్వం, దారిద్ర్యం -
నా పడగపైన మెరిసే మేలిరత్నాలు
మళ్ళీ మళ్ళీ తలెత్తుతున్నాను నేను!
కుళ్ళి కుళ్ళి కంపుగొట్టే
ఈ నికృష్ట సమాజ వల్మీకంలో!
మళ్ళీ మళ్ళీ బుసలు కొట్టుతున్నాను నేను!
కళ్ళుర జేసినా కాటెయ్యలేని
ఈ యసమర్థ సాంఘిక తిమిర మానసంలో!
చీదజాటి పోతున్న ఈ ఆర్థిక వ్యవస్థలో
పగలు రగిలించే త్రాచుబామును నేను!
వగజెంది, శ్రమిస్తున్న దైన్య ప్రజానీకానికి
ఆగచాట్లు,నిత్యంగా, సుస్థిరంగా జేసి -
కాటేసే మిన్నాగును నేను!
మూఢజాత్యంధకారానికి - ప్రతీకను నేను!
వికృతాత్మస్థైర్యానికి - ప్రతిరూపాన్ని నేను!
ధర్మాధర్మాలకు - తేడా
'అ' అనే ఆద్యక్షరమని తెలిపే -
గీతాపరమార్థాన్ని నేను!
ఆ శ్రీకృష్ణ పరమాత్మ
ఒక్కడేగాదు -
'సంభవామి యుగేయుగే!'
అని అనటానికి -
అవతారాలెత్తటానికి -
ఈ తృష్ణలోని పరమార్థం -
చక్కగా జీర్ణించుకొన్న
పుంభావ తక్షకుణ్ని -

నేనూ ఉన్నాను
మళ్ళీ మళ్ళీ విషభుజంగంగా
జన్మించటానికి!
మళ్ళీ మళ్ళీ అపర దశావతారాలు
ఎత్తటానికి!
క్రిందపడినా
పై చెయ్యి నాది!
సంధి జరిగినా
యుద్ధం ప్రకటించటం నా విధి!
తప్పు తెలిసికోలేని
పప్పుదద్దమ్మలై -
ఒప్పుగా జీవితాన్ని సరిదిద్దుకోలేని
పేదరాసి పెద్దమ్మలై
మీరంతా విభ్రాంతులై
కళ్ళప్పగించినా-
మీరంతా ప్రమత్తులై
పళ్ళికిలించినా-
మళ్ళీ తలెత్తుతాను నేను!
మీ హృదయాంతర తిమిర వల్మీకంలో
క్రూర విషోగ్రభుజంగ ఫూత్కారంతో!
మళ్ళీ మళ్ళీ తలెత్తుతాను నేను-
మీ అజ్ఞానగ్రస్త మేధః వల్మీకంలో-
అపార విషాదవహ్ని ద్విజిహ్వాగ్ర సంరంభంతో!!!

# అంతర్మథనం

నేనొక మట్టి పుర్వును!
నిత్యమూ తొలుస్తుంటాను మేధస్సుని!
నేనొక తమాల పల్లవకాంతిని!
నిత్యమూ జపిస్తుంటాను ఉషస్సుని!
అవిచ్ఛిన్నంగా పరిశ్రమించే నా వ్యావృతి
భూమాతకే ప్రతికృతి!
నిరంతరంగా శోధించే నా వలయాకృతి-
మానవాళికే ఒక బహూకృతి!
తలాతోకాలేని దాన్నంటారు నన్ను!
తలలూ, తోకలూ ఉన్న నరవానరులను-
మించిన స్థితప్రజ్ఞుణ్ణి నేను!
వాళ్లంతా గతచరిత్ర నెమరేసి -
మళ్ళీ మళ్ళీ పప్పులో కాలేస్తుంటారు!
చర్విత చర్వణంగా - గిరిగీసిన పరిధుల్లో
పరిభ్రమిస్తుంటారు గానుగెద్దుల్లా!
అంతర్గతమైన గతంలో
అంతంలేని భూగర్భంలో
కల్మషాన్ని కరిగించి, నైర్మల్యాన్ని వెలికిదీసి,

భూసారాన్ని నెమరేసి,
తిరిగి తిరిగి పైకి తోడేస్తుంటాను నేను!
ఫలవంతమైన ఎరువులను
సస్యశ్యామల సముద్భూతంగా
తిరిగి తిరిగి సృష్టిస్తుంటాను నేను!
ఉన్నదానినే మళ్ళీ మీకిస్తాను!
మన్నులోనే పడుంటాను - మీకు పనికి వస్తానని!
ఈ అంతరాయాలు, లేని నా కార్యక్రమంలో
పంతాలు లేవు! పట్టింపులంతకన్నా లేవు!
వంతపాటలు అసలేలేవు!!
నిష్కామకర్మనాది!
శుష్కప్రియాలు - శూన్యహస్తాలు - కావు నావి!
నినాదాలతో ప్రమేయమే లేని
అనామకుణ్ణి నేను! అమాయకుణ్ణి నేను!
ప్రచ్ఛన్నంగా కృషి జేసే
స్వచ్ఛంద సేవకుణ్ణి నేను!
ప్రగతిపథాని కాంక్షించే
శాంతి కాముకుణ్ణి నేను!
అతి సామాన్యమానవ నైజసామాన్యాన్ని నేను!
నా నిరంతర కృషికి, నా అవిరళ పరిశ్రమకు -
పదవులూ, బిరుదాలూ - కొలబద్దలు కావు!
నా స్వేదం - సర్వమానవ సంక్షేమానికే కైంకర్యం!
నా రుధిరం - సర్వజీవరాసుల కళ్యాణానికే వినియోగం!
అయినా - బలిపశువుగా -
నన్ను గాలానికి గుచ్చి - నెత్తురు మడుగుల్లో తేల్చి -
ఎరగా వేస్తారు మానవులు-
చేపలవేటలో ప్రబుద్ధులు!

పాపపు ఆటల్లో ఆరితేరిన ప్రబుద్ధులు!
నన్ను వంచించినా పరవాలేదు!
గ్రుచ్చిగ్రుచ్చి హింసించినా కొరవేమీ గాదు!
కానీ నన్ను ఎరజూపి ఉరికంబమెక్కించేస్తారు!
పాపం! - అభంశుభ మెఱుగని ఆ చేపపిల్లల్ని!
కృతజ్ఞతా సార్వభౌమత్వానికి-
సిసలైన ప్రతినిధులు వాళ్ళు!
సిలువవేసిన 'ఏసు'ను కాకపోయినా-
నలువజేసిన సృష్టిలో - నేనూ ఒక జీవినే!!
నా మనుగడకు సార్ధకత-
అంతర్గత హాలాహల నిర్మూలనం!
నా ఉనికికి చరితార్థత-
అంతర్మథనామృత ప్రసాదం!
నేనొక మట్టి పుర్వును -
నిత్యమూ తొలుస్తుంటాను -
మేధస్సుని!
నేనొక తమాలపల్లవ కాంతిని -
నిత్యమూ జపిస్తుంటాను -
ఉషస్సుని!

# పిడికెడంత ఆకాశం

ఒంటరిగా
జీవితాంతం-
ఇనుప చువ్వల వెనుక,
ఇరుకుగోడల మధ్య,
మురికి చెరసాల గదుల్లో
నరకయాతన అనుభవింపమని -
విధించింది ఇనుపసంకెళ్ళ చట్టం!
మనసు బంధింపలేని మరల చట్రం!-
నేరమేలేని ఈ నరునిపై
ఘోరమైన శిక్ష విధిస్తూ!
బయట ప్రపంచం
క్రీనీడలైనా పడవు నా మీద!
మొయిలు రేఖామాత్రంగా
ఎన్నడో కనిపిస్తుంది నననన్నగా
రెండు నిలువెత్తుల పై నున్న
ఇనుప చువ్వల కిటికీ సందుల్లోంచి!
ఆ నీలిమబ్బుల తుదల కదలికలు,
ఆ వినీలాకాశలాస్యలేశం,

పిడికెలంత నా యెదలో
ముడుచుకొన్న ఆశాభావలేశ పతాకంలా–
విరుస్తుంది! రెపరెపలాడుతుంది!
ఈ అల్పాతి అల్పమైన
ఈ రేఖాతిరేఖా మాత్రమైన
ప్రకృతి మధుర సందర్శనానికి
ఎదురు తెన్నులు చూస్తాను!
హృదయం వాకిలి తలుపులు బార్లా తెరచి ఉంచి!
అదే! ఆ చిన్ని కదలికే –
రమణీయ శిల్పరేఖా విచిత్రంగా తలపోస్తాను!
మొద్దుబారిన తనువు,
హద్దుల్లో మణగిన మనసు,
ప్రొద్దస్తమానమూ
రాతిగోడలనూ, ఇనుపచువ్వలనూ,
కటకటాలనూ, కటికచీకటినీ, కాకు నలుపునూ
చూచి, చూచి, చూచి - విసుగెత్తిన, అలసిపోయిన
నా ఆలోచనా నయనద్వయాలు–
ఆ కొద్దిక్షణాల్లో–
హద్దులు త్రెంచుకొని, బద్ధకం వదుల్చుకొని
చైతన్య స్రవంతులై
దూరదూరాన కనిపించే
ఆ నీలిగగనాల, ఆ తెలిమబ్బు తునకల,
కించిత్ భాగాలని,
అత్యల్ప కాలంలో జరిగే
హఠాత్సందర్శనానికి
ఉబ్బితబ్బిబ్బులౌతాయి!
బాహ్యప్రపంచంలో

చెఱసాల గోడల అవతల
ఎప్పుడు ప్రొద్దు పొడుస్తుందేమో?
నాకు తెలియదు!
కానీ -
గ్రుడ్డి చీకటి,
కన్ను పొడుచుకున్నా కానరాని
కాఱు నలుపుపట్టిన చెఱసాల గోడలు
మసకమసకగా రంగువెలిసిన నలుపు చీరలా
విరిసినట్లుంటే
అదే నాకు ప్రొద్దు పొడుపు!
పక్షుల కలకలారావాలు
తొలిప్రొద్దు పసిడి ఎండల వెచ్చని గిలిగింతలు
చెరసాల వెలుపల వినిపిస్తాయేమో?
కనిపిస్తాయేమో? అనుభవానికి వస్తాయేమో?
నాకు తెలియదు!
పొరపాటున జైల్‌వార్డన్
తెల్లవారు జామున్నే తనిఖీకి వస్తున్నాడన్న
గాలి కబురుతో కంగారుపడి
పరుగులు దీసే జైలుజవాన్ల
బెదిరిన ఈలల ప్రతిధ్వనులు
ఈ ఏకాంతవాసకుడ్యాలలో వినిపిస్తుంటే
అదే నాకు మేలుకొలుపు!
మలి సంజవేళ పొలాల నుండి తిరిగొస్తూ
ఆలమందలు రేపిన ధూళి ధూసరాలు
గూండ్లకు మేతతో తిరిగి చేరుకుంటూ
నోరులేని పసికందులను చూసి
ఈలలేసిన, ఎగిసి గంతేసిన

మాతృపక్షి హృదయాలు-
ఆ ఆనందరవ తరంగాలు-
బాహ్య మానవలోకంలో
సంధ్యా సమయంలో
కనిపిస్తాయో? వినిపిస్తాయో?
నాకు తెలియదు!-
జైలు పోలీసుల
బూట్ల టకటక చప్పుడులు -
చెరసాల గదుల తాళాలు 'క్లిక్'మన్న సవ్వడులు! -
గతాన్ని తలచి, తలచి,
భవిష్యత్తును అసలే ఊహించలేక,
సన్నగా ఎలుగెత్తి ఏడ్వడానికైనా
పలుకందని గద్గద కంఠంలో
జీరబోయిన చిన్నమూల్గు కూడా ప్రతిధ్వనింపక -
సన్నసన్నగా, మెలమెల్లగా ఆగినప్పుడు-
అదే! నాకు నిద్రరాని, జోలపాట పిలుపు!
నా తనువునైతే ఉనికి తెలియకుండా
ఈ చెరసాల చీకటి గదిలో
బంధింపగల్గారు సంకెళ్ళు వేసి!
నా కనులనైతే, మనికి చూడకుండా
ఈ భీకర కారాగారాంధకారంలో
నిలువునా పాతిపెట్టగలిగారు!
కానీ-
ఈ చెరసాల ఇనుప కటకటాల కందని,
ఈ కారాగార శిలాప్రాకారాలకు లొంగని,
ఈ చింతనామయ,
చైతన్య భావనా స్రవంతిని,

నా మనోభావనోద్రిక్త నిర్ఝరిని -
ఎవరాపగలరు? ఎవరాన కట్టలు కట్టి బంధింపగలరు?
స్వల్పాతి స్వల్పమై, వర్తులాకారంలోనున్న
ఈ చెరసాల కిటికీల నుంచి
ఎన్నడో అరుదుగా, కంటికి కనిపించే
పిడికెడంత ఆకాశం -
నా మనోనయన దృక్పథంలో,
నా భావనా విహంగ విహారయాత్రలో-
"వినీల గగనం! విశాలవిశ్వం! సర్వమనంతం!!"- గా
పాలవెల్లిగా, ఆశాజోత్స్నగా, నిలిచి, విరిసిపోతుంది!
నా అలసిన తనువు,
నా సొలసిన సర్వాంగాలు,
విశ్రాంతినీ, నిశ్శబ్దాన్నీ, అంధకారాన్నీ - కోరుతుంటే
నా మనస్సు,
స్వేచ్ఛా విహంగమై,
ఆ చిన్న కిటికీలోంచి,
ఆ సన్న ఇనుపచువ్వల సందుల్లోంచి,
అనంతాకాశంలోనికి
వినీల గగన పథంలోనికి
పరుగులు తీస్తుంది!
తెలిదూది పింజెల్లా
క్షణంలో కనుమరుగయ్యే
మబ్బుతునుకల వెంట
శంపాలతల్లా
పరుగులు తీస్తాయి
నా భావనావిద్యుల్లతలు!
శృంఖలాల బంధాల నుండి,

కటకటాల చెరసాల నుండి
కటిక చీకట్ల మునురులు నిండిన
జాతిగోడల నుండి -
స్వేచ్ఛావాయువులు పీల్చాలని
మళ్ళీ మళ్ళీ నేలమీద
తలెత్తుకు తిరగాలని
ఈ నిందిత తనూ విహంగం
బాధ పడిపోతుంది!
ఎడదలోతుల్లో దాగి, విడదీయ శక్యంగాని
మానవతా మమతానుబంధాలు
ఈ నిర్జీవమైన కారాగారంలో
బంధింపబడి విలవిలలాడి పోతాయి!
భవబంధ శృంఖలాల నుండి
సంసార కారాగార దుర్భర నివాసం నుండి,
అజ్ఞానాంధకార పరిధుల నుండి
మాయా తిమిర పరీవృత ప్రాకారాల నుండి
అనిత్యమైన శరీర సంబంధం నుండి
విముక్తి జెంది, జన్మరాహిత్యం పొందాలని,
అలౌకిక సాగర తీరాల నందుకోవాలని,
ఈ జిజ్ఞాసార్తిభరితమో,
ఈ ఆలోచనామృతమయమో
నా మనోవిహంగం -సుడిగుళ్ళు పడిపోతుంది!
సగర్వంగా, నిత్యమూ
ప్రగల్భాలు పలికే - ఈ వాచాలునికి
ఈ నిర్భర ఏకాంతవాసం
ఈ నిత్య మౌనవ్రతం
ఒక తీరని శాపం!

ప్రతినిత్యమూ, వెలుగు వెల్లువలను,
అనునిత్యమూ, జ్యోత్స్నా తరంగాలను,
క్షణక్షణమూ, భోగభాగ్యాలను
అహరహమూ, ప్రేమచంద్రికాలహరులను,
వాంఛించే -
ఈ షోకిల్లారాయుడికి,
ఈ పోకిరీ మనసుకు,
ఈ నిర్భర కారాగారవాసం-
ఒక దుర్భర శాపం!
ప్రబంధ కవుల - చిత్ర కవితా మహేంద్రజాలంలో
పౌరాణిక కావ్య - భక్తి రసావిష్కార పారవశ్యంలో
ఆధునిక వచన కవితా భావ విప్లవంలో
సర్వప్రపంచ నవీన సాహిత్య, పారిజాత సౌరభాఘ్రాణంలో
భారతీయ, పాశ్చాత్య సంగీత సమ్మేళనమౌ
ఆపాత గానమాధుర్యంలో,
నయన రమణీయమై, విచిత్ర దృశ్యకావ్యమై
ప్రాచీన, నవ్య - శిల్ప కళాభాండావలోకనంలో-
మునిగి తేలి, పరవశించి, ద్రవించి
ఊహాలోకంలోనే స్వర్గలోకాలు నిర్మించుకొన్న
ఈ కళాహృదయం, ఈ రసిక సహృదయం
ఈ చెరసాల ఇరుకు గదుల్లో-
ఈ కాఱుచీకట్లు నిండిన వగపు బ్రతుకుల్లో-
మ్రగ్గి మ్రగ్గి కృంగి, కృశించి
మౌనాన్ని పఠిస్తుంది! నిశ్శబ్దాన్ని తిలకిస్తుంది!
తిమిర సంగీతాన్ని ఆలపిస్తుంది!
ఇక -
మిగిలింది - తీరని దిగుళ్ళు!

పగిలింది - ఆశాలోక భాండం!
రగిలింది - ఆరని అవమానదావాగ్ని!
మౌనంలో, నిశ్శబ్దంలో, అంధకారంలో
ఈ నల్లని ఇనుపకటకటాల వెనుక -
ఈ మానవ సంచారమేలేని ఒంటరి ఖైదులో
నాలో నేను ఎన్నాళ్ళు అంతర్ముఖుణ్ణై,
ఈ ఎదలోని గనుల లోతుల తుదల్లో,
ఈ మదిలోని పాతాళగంగా తరంగాలలో-
త్రవ్వుకొని, త్రవ్వుకొని, మరీ మరీ త్రవ్వుకొని
ఆలోచనా సరసీబృహత్ తరంగాలను,-
సాలోక్య నిర్ఝరీ భంగాలను
సృష్టింపగలను?
ఎన్నాళ్ళని? ఎన్నాళ్ళని? మఱెన్నాళ్ళని??-
ఈ గుండెసెలయేళ్ళ దూకుళ్ళలో
భావనా తరంగోద్భూత ప్రయోగాలను
విప్లవకేతనా సంచాలనంగా
ఊపి, ఊపి, ఈదులాడుకోగలను?
ఊపి, ఊపి, వాదులాడగలను?
నిర్జీవమై, నిశ్చలనమై, నిష్ప్రయోజనమై
ఈ శరీర మలసిపోయింది- భౌతికంగా!
క్రియాశూన్యమై
నిరంతర ఆలోచనా స్రవంతుల్లో తేలియాడి
భావనా తరంగాలను, ఉవ్వెత్తుగా పెనుఝంఝులా
లేపి, లేపి, కదిలించి, విదిలించి
ఈ ఆలోచనా జలధి - నిశ్శబ్దతరంగావధియై
అలసిపోయింది - మానసికంగా!
నిరంతరం చింతించే ఈ మనసు -

అనుక్షణం సుడుగుళ్ళు పోయే ఈ యెదంద -
అహరహం విప్లవాలు భావనాలోకంలో
సృష్టించే ఈ సునిశిత మేధస్సు —
ఎల్లప్పుడూ నవ కవితా నిర్ఝరులు సృజించే -
ఈ భావోద్రిక్తయువ హృదయం
అన్నీ కలిసి - అలిసిపోయాయి!
అన్నీ కలలై - కరిగి విరిగిపోయాయి
అన్నీ ఆటుపోటుల్లేని కడలి తరంగాలులా-
జీవన జలధీ మౌన పరిష్వంగంలో ఒదిగిపోయాయి!
శారీరకంగా, మానసికంగా, ఊహాతీతంగా -
ఈ జీవి-
నిత్య విరామాన్ని, శాశ్వత నిశ్శబ్దాన్ని, అనంత కాలమౌనాన్ని
కోరుకుంటుంది!
అందుకే -
ఈ స్వల్పాతి స్వల్ప కారాగార గవాక్ష
రంధ్ర పరిధుల్లో -
నయనానందకరంగా - అలల్లా, కరగిపోని కలల్లా -
తేలియాడే తెలిమబ్బు తునకలు -
ఆ మబ్బుల వెనుకదాగిన నీల వినీల గగనాలు -
ఇదంతా దృశ్యమానమయ్యే, మానస గోచరమయ్యే -
ఆ పిడికెడంత ఆకాశం!
అదే! ఈ తుది ఘడియలలో - నాకు మిగిలిన -
భావనా మధుర జ్యోత్స్నా తరంగం!
అదే! ఈ చివరి క్షణాలలో నాకు దక్కిన
ముక్తికాంతా రమణీయహాస్య తరంగలాస్యం!

# మళ్ళీ నేను చిగురిస్తానా?!

మళ్ళీ నేను చిగురిస్తానా?
మళ్ళీ మళ్ళీ నేను వికసిస్తానా?
మరుతూపుల విరబూచిన తరుతన్విని!
అరుణారుణ కిరణరాగ వికసిత
యౌవన కుసుమాంగిని!
విశాల హరిత పత్రాంచిత వినీలకేశభర శోభితను!
వయసున మిసమిసలాడే స్వీయతరుబాహాశాఖికను!
నిర్మలాంతరంగంలో పొంగులువాఱే
గంగాతరంగాచ్ఛ ప్రేమాంబువు లాస్వాదించే -
తరుమూల ప్రాణిని!
నవ వసంతాగమనానికి,
మానసోల్లాస చంద్రోదయానికి -
నిత్యం నిరీక్షిస్తున్న - తరుతను జ్యోత్స్నాభిసారికను!
ఏకాకిగా వేచాను! చీకాకుతో నిలిచాను!
నల్లనల్లగా ఆషాఢ మేఘం-
కనుచూపుమేర మొయిలు బయలు క్రమ్మింది!
చల్లచల్లగా రోషోగ్రప్రభంజనం-
తనువోపలేని మేర - చదల గ్రమ్మింది!

అకాల తీవ్ర వర్షాగమసూచనలు -
ఆశాంతాల మెరిసి విజృంభించాయి-
ఉరుములై! కళ్ళు మిర్మిట్లు గొల్పే మెఱుపులై!
పోగాలం దాపురించేలా - ఝంఝుమారుతం
నల్దిక్కులా విరిసి, బెడిసి కొట్టింది!
ఆగామిసూచక విషాద కధనం-
నా గాత్ర ప్రకంపిత - గానసుధా జలధీ మథనమైంది!-
విశాలపత్ర కేశాకర్షణ - కిమ్మీరవర్ణ పుష్పగవేషణ -
అరుణారుణ ఫలాన్వేషణ -
కామోద్రేక విజృంభణలై - భావోద్రేక ప్రేరణలై -
రక్కసిగాలి, ఉక్కు బిగి కౌగిలి జిక్కి -
ఉక్కిరిబిక్కిరై, ఒక్కదాన్నిగా నిలిచాను
పతిత బాహు శాఖాకృతినై!
జడివాన బడలి, సుడిగాలి జడిసి,
పెూరుకు నీరై, జోరుకు వణుకై
వలువలొలిచిన లలనలా - కుంచించుక నిలిచాను!
నిరస్త పత్రాకృతినై!-
కామాంధుడై వాయువు, కోపోద్ధతుడై వరుణుడు
విక్రమించి, ఆక్రమించి, బలాత్కరించి,- అనుభవించారు-
ఆ నడిరేయి - ఈ అనాఘ్రాత తరుతన్వీ యౌవన కుసుమాన్ని!
'అయ్యో పాపం!' అనలేక
నిస్సహాయంగా చూస్తూ విలపించింది భూమాత!
అచేతనంగా, జడమై, నిర్భంగయై శోకించింది!
గిరిశృంగ వినిస్రుత స్రోతస్విని!
మౌనంగా కళ్ళప్పగించి చూస్తూ
ఏడుపు దిగమ్రింగుకోలేక, వెళ్ళగక్కలేక
సుడుగుళ్ళు పడింది చరాచర ప్రకృతి!

వాన వెలిసింది! గాలి నిలిచింది!
రాత్రి-తుఫాను మత్తువదిలి, బద్ధకంగా ఆవులించి
నిద్ర లేచింది!!
ఛెళ్ళునే కొరడా చివళ్ళలా
ఒళ్లంతా స్పృశించే తొలివెలుగులతో -
భళ్లున తెల్లారింది!
అవమానాగ్నితో, పరాభవదావానలంతో
శీలాపహరణంతో, శాపోపహతురాలినై
నిలువెల్లా దహించుకుపోయి -
నామమాత్రంగా - శిలారూపంగా - నిలిచాను నేను!
తరుశిఖరాలు - తరుమూలాల నంటేలా -
కుంచించుకపోయిన, వంచితనైన - దిగంబరినైన
నా పరిదీన వదనాన్నే ప్రొద్దు పొడిచింది!
సిగ్గేసి, అగ్గల్లాంటి కాముకుల కోరచూపుల్ని తప్పించుకొందామని
మై మరువుగా, వెలుగు వెల్లువల వలువ
కప్పుకుందామని తాకేసరికి, చెయి జాచేసరికి-
అదీ అదృశ్యమై పోయింది!
సమీపాన పడియలు, పడియలుగా నిలిచిన జలదర్పణంలో
నా ముఖాన్ని చూసుకొన్నాను నేను!
తరణికిరణాలు, నులివెచ్చని వెలుగులు ప్రతిబింబించే
ఆ స్వచ్ఛ జలాల్లో, నా తనూ నగ్నత్వాన్ని
పరీక్షించుకొన్నాను నేను!
ఏం మిగిలింది నాకు? ఏమయ్యింది నాకు?
నిస్తేజ, నిరస్తభూష, నిర్వేద భాగీరథి -
నాదైన గాధా ప్రతిబింబంగా నిలిచి, వెక్కిరించింది నన్ను!
విరిగిన, నురిగిన - నునులేత కొమ్మలు
తరిగి, తరిగి నేలవ్రాలిన చిగురుటాకులు

వసివాడి, తొడిమ తెగిన, అరవిరిసిన కుసుమాలు -
భంగపాటులతో, నడుము వంగి, నేలగరచిన బోదె-
మొదళ్ళంట క్రుళ్ళగింపబడ్డ వ్రేళ్ళు
ఇవీ మిగిలాయి నాకు!-
ఆ మరపురాని రహోదుస్స్వప్న కథనంలో!
తను, మాన ప్రాణధనాలు హరింపబడ్డ అనాథను నేను!
కామాంధతకు, దురహంకారానికి, అన్యాయానికి -
బలియైన, నిస్సహాయనైన, తరుతన్విని నేను!
పురోడాశస్పృశిత యజ్ఞవస్తువును నేను!
తీగతెగిన భగ్న విపంచిని నేను!
ఈ అవమానావృత హృదయంలో,
ఈ శోకభరిత చిత్తవీణలో,
జీవన చైతన్యరాగం మళ్ళీ పలుకుతుందా?
మ్రోడైన వసివాడిన నా తరుతనువులో
నవనవోన్మేష కుసుమంలా,
అరుణారుణ పల్లవంలా -
వసంతం మళ్ళీ తొంగిచూస్తుందా?
మృదులజ్జా పిహితనై,
ఎదలో పునరుజ్జీవన కోకిలా కుహూరావం వినిపించి,
మళ్ళీ నేను చిగురిస్తానా?
ముగ్ధ మనోహర కుసుమ దరహాసనై
మళ్ళీ మళ్ళీ నేను వికసిస్తానా?
గతాన్ని మఱచి, వర్తమానాన్ని ఆసించి
భవిష్యత్తు నూహించి
పసిడికలలతో సరిక్రొత్తగా
మళ్ళీ నేను చిగురిస్తానా?
మళ్ళీ మళ్ళీ నేను వికసిస్తానా??!-

---

**జి.వి. సుబ్బారావు**

# ద్విజిహ్వ

బుసలు కొట్టోంది
అంతరంగ వల్మీకంలో
మనోబుద్ధ్యహంకార భుజంగం
ద్విజిహ్వాగ్ర రోషానలంతో!!
ఆర్థికార్థ శాస్త్రాలు
అణుగణిత, శాస్త్ర విజ్ఞానాలు
సాంఘిక, చారిత్రక, రాజకీయ పరిజ్ఞానాలు
లౌకిక వ్యాపార నీతిజ్ఞతలు
అన్నీ - ఒక జిహ్వాగ్రంలో నిలిపింది
మనోభుజంగం!
వేదవేదాంగాలు, పురాణేతిహాసాలు
సర్వమత సారసంగ్రహాలు
గీతోపనిషద్భాష్యాలు,
గురుశిష్య పరంపరాగత
నిగూఢ వేదాంతార్థ ప్రవచనాలు
అన్నీ - మఱొక జిహ్వాగ్రంలో
పదిలపరిచింది - మనో భుజంగం!!
అపూర్వ లౌకిక జ్ఞాన పరమార్థం

అసమానతలను అట్టే నిలబెట్టింది!
అనన్య సామాజిక, రాజకీయ పరిజ్ఞానం
అన్యాయాన్ని అలానే ఉసికొల్పుతుంది!
'నభూతో నభవిష్యతి'-అనేలా ఎదిగిపోతున్న
సాంకేతిక, విజ్ఞాన శాస్త్ర పరమార్థం -
ఆకలి మంటలను - అసలే చల్లార్చ లేకపోయింది!
పారలౌకిక విజ్ఞానమే పరమార్థమన్న
మత ప్రవక్తల సూక్తి విధానం-
మనశ్శాంతిని ఏ కొంచెమైనా ప్రసాదింప లేకపోయింది!
అశాంతి, ఆక్రోశం, ఆవేదనా -ముప్పిరిగొని
బుసలు కొట్టింది - మనోబుద్ధ్యహంకార భుజంగం!
ద్విజిహ్వాగ్ర రోషానలంతో!
కుబుసమూడ్చని భుజంగినిలా,
అజ్ఞానంలో, అంధకారంలో, మత్తులో, మగతలో
పడి ఉంది - ఈ మానవ మేధస్సు!
శతసహస్ర కోటి యుగాల వెనుక నాటి -
తిర్యగ్జాతి ఆది మేధస్సు-
ఈ మానవ మేధస్సులోని అధోభాగం!
అనంత విజ్ఞాన సూర్య ప్రభా ప్రతిభా
భాసమాన జ్ఞాన రోచిస్సు
ఈ మానవ మేధస్సులోని
ఊర్ధ్వ భాగం!
ఈ రెండింటినీ ఆకళించుకోలేక, సమన్వయ పరుచుకోలేక
పాశవికమై, అనాగరకమై, అజ్ఞానాంధకరమైన,
అధోభాగం నుండి -
ప్రతిభాసమన్వితమై, ఊహాతీత జ్ఞాన సముపాత్త
శక్తి సమన్వితమై, విజ్ఞాన జ్యోతిలా వెలిగిపోతున్న

ఊర్ధ్వ భాగానికి
రాలేక, అందుకోలేక, అతి సంకుచిత కపాలంలో
కుండలినీ శక్తియుత, అపూర్వ మేథో విప్లవం
సృష్టింపలేక అలమటిస్తున్నాడు
అంధుడై, ఆవేశపరుడై, అజ్ఞానియై
మానవ పశువు!
అనితరసాధ్యమై,
సర్వలోక కళ్యాణ సంధాయకమై,
లౌకిక సౌఖ్య పరమావధియై
నిరంతరం వెలిగే ఆ తొలివెలుగుబాట
నందుకోలేక పూత్కారం చేస్తున్నది ఒక జిహ్వ!
అలౌకిక విజ్ఞాన సర్వస్వమై
మూలశక్తి స్వరూప సందర్శన భాగ్యమై
కాలాతీత, ఊహాతీత, వ్యోమాతీత
విహార భావాస్పదమై
జ్వలించే అనంతజ్యోతిర్మయాత్మ
నందుకోలేక సీత్కారం చేస్తున్నది మఱొక జిహ్వ!!
భావనా పథగమనం-
ద్విధావిభాజ్యమై,
ఊహా పథ సంయమనం-
శతధా క్రోధ భావావేశమై
బుసలు కొట్టే
ఈ ద్విజిహ్వగ్నికి,
కుబుసమూడ్చని
ఈ సరీసృపానికి -
కోరలూడ్చే మంత్రగాడు
పారలొలిచే తంత్రజ్ఞుడు -

ఉన్నాడా?
మానవమేధో పరిధిలో
లౌకిక జ్ఞాన పరమావధీభూత
సమ్మోహనాస్త్రంగా
వినిపించదా?
వేణునాదం
ఈ మనోభుజంగానికి!
పారలౌకిక విజ్ఞాన భావనా భరిత
గోపికా హృదంతర జ్యోతిర్మయంగా
కనిపించదా?
బృందావనం
ఈ మేధో భుజంగానికి!
అందుకే నేమో?
ఇంకా
బుసలు కొట్టోంది
అంతరంగ వల్మీకంలో
ఈ మనోబుద్ధ్యహంకార భుజంగం
ద్విజిహ్వాగ్రరోషానలంతో!!

# కొసఊపిరి

కొస ఊపిరి! కొస ఊపిరి!!
అసిధారావ్రతలహరి!
ఆశాపాశాజ్యోత్స్నాలహరి!!
తళుకుకొస్తున్నాయి-
ఉరుములుఉరిమినట్లు, గాండ్రించి,
జడిపించే బెబ్బులులు!
బుసలు కొట్టున్నాయి
కసిదీరని విషపు కోఱల : సుప్త భుజంగాలు!
ముంచుకొస్తున్నాయి
మించిన ఇరులతో వంచించే నీలిమొయిళ్ళు!
మరులు గొంటున్నాయి-
తరుణ యౌవన మదం
రంజించే భిల్లకామినులు!
తలలూపుతున్నాయి
చలులేచిన గాలులతో
సితాసిత తరులతాభూతాలు!
ఇరులకు వెఱచి, ఉరుములకు జడిసి,
కోఱలకు వణకి, మరులకు కలగి,
పరుగెడుతున్నాడీ మానవుడు!

దారీ తెన్నూ తెలియని పాంథుడు!
భయంతో హయంలా పరుగెడుతూ
కాలుజారి పడ్డాడు దిగుడుబావిలో!
వ్రేలుతున్న మఱ్ఱి ఊడ ఆపద్బాంధవుడిలా
కాలి కడ్డంతగిలి, నిలబడ్డాడు తలక్రిందులా!
కొస ఊపిరి బిగబట్టి,
దిశలన్నీ ఎగాదిగా పరికించాడు!
క్రింద -
అగాధమైన యమకూపం!
అందులో - కోఱలతో కాటేద్దామని
పొంచుంది భయంకర భుజంగం!
రూపుగొన్న మృత్యువులా!
మీద -
దట్టంగా పరుచుకొన్న వటవృక్షం!
దాన్ని మూలముట్టుగా పెకలిద్దామని
పూనుకొంది ఆరుమొగాల మదమత్తగజం!
చెవులు రిక్కించి, నలుదెసలా
శబ్దాలన్నీ విన్నాడు!
తరుమూలం త్రవ్వేస్తున్న
మూషిక సమూహనాదం - భవితవ్యగీతంలా!
తరులతాంతాలలో
మధువు సేవించి తనిసే
మత్తమధుకర బృందగానం - వర్తమాన సంగీతంలా!
ద్వాదశ పాదఘట్టనలతో
కదిలించే మదసామజ ఘోర ఘీంకార రావం-
గత విపంచీరావంలా!
అన్నీ - వినిపించాయి!
తన ప్రస్తుత విపత్కర పరిస్థితి ఎలా ఉందో
ఒకసారి తీవ్రంగా పరిశీలించాడు!

చెయి జాచితే - అగాధ జలకూపంలో
క్రూర భుజంగానికి - మండూక సదృశం-తన ఉనికి!
చెట్టు పట్టు - తన పాదం నిలద్రొక్కుకోలేకుంటే -
ఉన్మత్త మద మత్తేభానికి -
లీలామృణాళం - తన తనువు!
నలుదిక్కులా పొంచుంది మృత్యువు!
తలక్రిందులా వ్రేలాడుతుంది తన తనువు!
అయినా -
కొనఊపిరితో
ఎడదలో సడలని ఆశాపాశంతో,

మనసు జీవనరాగంలో,
తనువు జీవిత సమరంలో
మనోబుద్ధ్యహంకారాల పటువుతో
మింటికీ మంటికీ నడుమ
జ్ఞాన లత నంటుకొని వ్రేలాడి
ఆశాజ్యోతి నయనాల వెలిగించి
కాలాన్నెదిర్చి నిలబడ్డాడా మానవుడు!
మృత్యువు నదల్చి కలబడ్డాడా పాంథుడు!
అందుకే పెగిలింది ఆలోచనామృతలహరి
అతని జీవనయాత్రలో కవితాస్రవంతిగా!
అందుకే మిగిలింది ప్రణయ పీయూషలహరి!
అతని సంసార ఘోరకాంతారంలో-
వనితా మనోవిక్రాంతిగా!
కొన ఊపిరి!
కొన ఊపిరి!!
అసిధారా వ్రతలహరి!!
ఆశాపాశాజ్యోత్స్నా లహరి!!!

# మృత్యుభయం

ఏదో ఏదోలా ఉంది హృదయంలో,
పదే పదే తలుపు తట్టి పిలుస్తుంటే -
మృత్యుభయం వాకిట్లో!
పసిడిబుగ్గల బాల్యంలో
ఆకలైతే ఏడవటం, పొట్టనిండితే నవ్వటం -
అమాయక శైశవంలో,
ఆటల్లో ఒళ్ళు విరవడం, కొట్లాటల్లో పరవళ్ళు పోవడం -
నూనూగు మీసాల నూత్న యౌవనంలో
ఉద్రేక తరంగాలపై ఉయ్యాలలూగడం -
ప్రౌఢ యౌవన వయః పరీపాకంలో,
శృంగార వాహినిలో తలమున్కలేయడం -
ఆపైన - చదువులు పూర్తి చేసి
బాధ్యతాయుత ప్రపంచంలో అడుగుపెట్టి
మిట్టపల్లాలో పొట్టకూటికి సాగడం -
గంతకు తగ్గ బొంతను వెతుక్కోవడం,
అడుసైన సంసారంలో గడుసుగా ఇరుక్కుపోవడం -
మధ్య జీవిత కాలంలో
ధ్యాసంతా వృత్తి రథం లాగడం -

మనసంతా సంతాన తాపత్రయంలో మునిగితేలడం -
ప్రొద్దు వ్రాలిన సంధ్యాసమయంలో,
బాధ్యత లింకా తీరిపోలేదని చింత చేయడం -
సాధ్యాసాధ్యాల మధ్య - భావనా విహంగాలు పరుగెత్తడం -
చిమ్మచీకట్లు ముసిరిన సంజవేళల్లో
తనూ మనోరుగ్మతలతో తల్లడిల్లిపోవడం -
అనూహ్య జీవన రథ గమన పరిణామాలకి అంగలార్చడం -
ఇలా -
గతస్మృతులు నెమరేసుకుంటూ,
గతించిన కాలంలో చేజారిన,
కావాలని జారు విడుచుకొన్న -
అవకాశాల వెల్లువలని గురించి,
సింహావలోకనం చేస్తూ -
వడలిన దేహంతో, సడలిన కీళ్ళ బంధాలతో
జడుపేదిన మనస్సులో, అడుగడుగునా అనుమానాలతో
వార్ధక్యంలో అడుగుపెడ్తూ -
గడచిన అర్వై ఏళ్ళల్లో
ఒక్కక్షణమైనా ఆలోచించని
సత్సంగ సుఖాన్ని-
ఇన్నాళ్ళూ మెదడులో అడుగున పడిన
తాత్త్విక చింతనాన్ని -
లౌకికంలో ముడివడ్డ
భావనా విహంగ సంచలనాన్ని -
మఱొక్కసారి పునః పరిశీలనగా -
తలుచుకొంటూ, కుమిలిపోతూ,
పరితపిస్తూ, పశ్చాత్తాపపడుతూ, -
ఆలస్యంగానైనా సరే -

కవితా తపస్సులో
సీతాసతీ మనో(శీలాన్యం చూఱగొందామని - నా రామాయణంతో పాటు -
నీ రామాయణం మొదలు పెట్టానయ్యా! స్వామీ!
భయంకరమైన ముసలితనం
పెద్దపులిలా భీకరంగా గాం(డిస్తుంటే -
వశంగాని (ప్రాణభయం, గుండెల్లో -
లేడికూనలా గజగజావణికిపోతుంటే
నా తలపెట్టిన తపస్సు,
నీకై వెలపెట్టిన మనస్సు -
రామా!-
నీ కథావాహినిలో, నిమగ్నమై,
రసా(ర్ద్రమై, ధ్వని మధురమై, (ప్రతిభామనోజ్ఞమై
తరించి, ఫలిస్తుందో, లేదోనని అనుమానం?-
ఈ శేషజీవితం,
ఈ (ప్రొద్దు(వాలిన వృద్ధ జీవన గమనం -
సాహితీ మనోజ్ఞలోకంలో,
రసరమ్య, ధ్వని మాధురీ భరిత, భక్తి సౌందర్యకలిత -
కావ్య పరీమళలహరులను విరిసి
ధన్యమౌతుందా?
నా జీవితం చరితార్థమౌతుందానని - సందేహం?!
అందుకే -
ఈ చరమకాలంలో,
ఈ అరుణారుణ సంధ్యారాగంలో -
ఈ మలిసంజలు విరిసే ముసురు చీకట్లలో -
ఏదో ఏదోలా ఉంది హృదయంలో
పదేపదే తలుపుతట్టి పిలుస్తుంటే -
మృత్యుభయం వాకిట్లో!!!

# THE FEAR OF THE UNKNOWN

*There is a knock at the door!*
*My heart beats a hasty retreat*
*My mind agitates over an unfair knockout.*
*My imagination flies back in retrospect.*
*As an infant, there is the comfort of mother's breast.*
*Aghast! The innocence leads to mischevous effort*
*And the mischief runs into teen-age unrest*
*Then emotion, love and dare-devilry, over - power*
*- the youth's delight.*
*In between, the tedium of studies makes you distraught*
*Then comes the pangs of unemployment,*
*The perils of competitive and cut-throat job persuit.*
*The delights of wooing, dating, settling in life of comfort*
*Followed by the pain and pleasure of child - rearing and middle age burden,*
*At last! -The twilight of old age, full of physical fatigue and mental exhaustion:*
*The run of life is uneven, narrow and blunt!*
*There is no time to stand and stare, till sun set!*
*And it is too late to ruminate over the past!*
*Now, I tune my Muse to poetical heights and delights*
*Oh! There is a knock again at the door!*
*And, the fear of the Unknown-is at the rear!!*

ఇది 'మృత్యుభయం' అనే నా కవితకు నేను సంక్షిప్తంగా ఆంగ్లంలో చేసిన స్వేచ్ఛానువాదం. ఇది 1993లో, *North American Open Poetry Contest* లో; *Editors' Choice Award* పొంది, *The National Library of Poetry, Mary Land, USA* ప్రచురించిన *Anthology of Poetry - 'Wind in the Night Sky'* లో- ప్రచురింపబడింది. (P. 287))

# భేతాళ నృత్యం

వర్తమానంలో,
ఆర్తనాదాల మహారణ్య మధ్యంలో,
సాంఘిక వటవృక్ష మూల తిమిరంలో
నాట్యం చేస్తున్నాయి
భూత భేతాళాలు -
జట్లుజట్లుగా - సిగపట్లుగా!
పైశాచిక నృత్యంలో
వరకట్న పరవశ - పిశాచి!
పరమపద సోపాన నృత్తంలో
విచలిత - ధనదాహభూతం!
రాజకీయ వ్యామోహ విహారంలో
పదవీ ప్రేరేపిత - రాక్షసి!
మూఢ విశ్వాసాల
గాడాంధ ప్రదర్శనలో
ఛాందస భావోద్దీపిత-భేతాళం!
అన్నీ -
మానవ మారణ
హోమాగ్ని చుట్టూ -

అన్నీ
దానవ ప్రవృత్తి
ప్రజ్జ్వరిల్లేటట్లు
విజృంభించాయి!
వికటాట్టహాసం చేశాయి!!
ఇది
మానస పాతాళ కుహరంలో
పైశాచిక భావనృత్యం!
ఇది
అవినీతి రజతాద్రి శిఖరాలపై
ప్రళయరుద్ర తాండవం!
ఇది స్వార్థ చింతనా జగత్తులో
భూత, భేతాళ
భీకర నృత్తం!!!

# షస్సులో నా తపస్సు

జేగంటలు,
గుడిగంటలు -
ముడిపడ్డ గళాలను విప్పాలని -
శబ్ద తరంగాలతో ఉషస్సులో,
తమస్సుల మౌనాన్ని ఛేదించాలని
ఆరాటపడుతూ, ఆర్తనాదాలు చేస్తున్నాయి!
పికిలిపిట్టలు, కోకిలమ్మలు -
కిలకిలారావాల, కుహు కుహూగానాల -
నిద్రించిన మనో విపంచీ స్తబ్దత్వాన్ని -
సుప్రభాత గానాలతో -
ఉషస్సులో తమస్సుల నిశ్శబ్దాన్ని
బద్దలు గొట్టాలని - ఆకాంక్షిస్తూ -
ఆక్రందనలు చేస్తున్నాయి!
దగాపడ్డ తమ్ముళ్ళను -
మగాళ్ళ బానిసోళ్ళ (ఆడోళ్ళ)ను
నిఘా వేసిన రక్షకులే
అఘాయిత్యం చేస్తే -
దిగాలుగా మింటికేసి చూస్తూ

యుగాలుగా సంకెళ్ళలో మ్రగ్గుతూ,
సగం చచ్చిన ప్రాణాలతో,
దిగంతాల దాకా మ్రోగిన
అసమానత్వ ఘంటారవంతో -
అరణ్యరోదనంలో కన్నీళ్ళే మిగిలిన -
ఉషస్సులో
తమస్సుల క్రౌర్యాన్ని అణగద్రొక్కాలని
కోపాన్ని దిగమ్రింగుకోలేక
దీనాతిదీనంగా
మౌనాతిమౌనంగా,
విలపిస్తూ
విప్లవిస్తున్నారు!- కవి కుమారులు!-
తమస్సుల
వైరోచన రాక్షస రాజ్యంలో
ఉషస్సుల
సామాన్య మానవ
వామనావతార విజృంభణం!
తమస్సుల
దశకంఠ కంఠ వికటాట్టహాసంలో
సమతారామ
ఉషోధనుర్జ్యావల్లీ మృదు నినాదం!
తమస్సుల
మందేహాహంకార హుంకారంలో,
ఉషస్సుల
మానవతావాద భాస్కర
వేదపారాయణం!
తమస్సుల
కాళియ భుజంగ ఫూత్కారంలో

ఉషస్సుల
కరుణార్ద్ర మనోబాలగోపాల
వేణుగానం!
తొలితెలివెన్నెలలా,
మలి పాలనుర్వులా,
వెలుగులు జిలుగులై
వెల్లి విరుస్తాయని -
విరిసిన విరి తావులతో - బొండుమల్లెల్లా -
నిండుగా యెదల్లో విచ్చుకొంటాయని
సౌహార్ద్ర రమణీయ పరాగాలని,
సుహృద్భావ మనోజ్ఞ పరిమళాలని,
విశ్వమంతా
వెదజల్లుతాయని ఆశిస్తూ -
తమోగతం నుండి
ఉషోవర్తమానంలోనికి
తొంగిచూస్తున్నా!
ఆశావిద్యుల్లతా
కాంతినయనాలతో!
ఊహాజ్యోత్స్న తరంగ
దృగంత రోచులతో!!
ఇదే
నా భావనా
భవిష్య దుషస్సు!
ఇదే నా తమోర్కస్తో
విధ్వంసక రోచిస్సు!!
ఇదే
నా కవితా హృదయ
మనోజ్ఞ తపస్సు!!!

# శిల్పాశ్రువులు

## తప్పొప్పుల పట్టిక (Errata)

| Sl.No. | Page | Line | For | Read |
|---|---|---|---|---|
| 1. | iii | 3 | మనస్తత్వ | మనస్తత్వ |
| 2. | ,, | 17 | ై భావ | భావ |
| 3. | ,, | 23 | హృదయం | హృదయ |
| 4. | 3 | 24 | స్ఫురద్రూపులు | స్ఫురద్రూపులు |
| 5. | 7 | 25 | మనో | నా మనో |
| 6. | ,, | 27 | కణం | క్షణం |
| 7. | 31 | 19 | నికృష్ణ | నికృష్ట |
| 8. | 32 | 1 | మహానలా | మహానల |
| 9. | ,, | 24 | బరువులు | బరువులు |
| 10. | ,, | 27 | పతితతం | పతనం |
| 11. | 37 | 11 | ఫంకరించి | ఫీంకరించి |
| 12. | 42 | 3 | ముప్పై | ముప్పై |
| 13. | ,, | 7 | ముద్దరాలని | ముద్దురాలిని |
| 14. | 43 | 6 | పోషిస్తున్నాని | పోషిస్తున్నానని |
| 15. | ,, | 23 | పధాల్లో | పథాలల్లో |
| 16. | 44 | 17 | ఎలవుల | వలపుల |
| 17. | 52 | 13 | జహాపనా | జహాపనా |
| 18. | 60 | 15 | గోల్‌కీపర్ | గోల్ కీపర్ |
| 19. | 72 | 1 | పణంగా | ఫణంగా |
| 20. | 77 | 23 | వినియాగం | వినియోగం |
| 21. | 93 | 7 | పరమార్ధం | పరమార్థం |
| 22. | 99 | 14 | మిట్టపల్లాల్లో | మిట్టపల్లాలలో |
| 23. | 104 | 14 | గాడాంధ | గాఢాంధ |